## విషయసూచిక:





## లెస్టర్ బి. పియర్సన్.

ఈయన కెనడా విదేశాంగ కార్యదర్శిగాను ఐక్యరాజ్య సమితి అధ్యక్షుడుగాను అమెరికాలో కెనడా రాయబారిగాను పని చేశారు.

ఈ ఉద్యోగాల్లో గడించిన అనుభవంవల్ల ప్రపంచరాజకీయ రంగంలో పాశ్చాత్యదేశాల తరఫున సాధికారంగా మాట్లాడ గల్గిన ఒక ప్రఖ్యాత వక్తగా పేరు పొందారు.

ఈ పుస్తకంలో నేటి ప్రపంచ ప్రజాస్వామ్యాలను ఎదుర్కొనే సమస్యల పరిష్కారానికి తన అనుభవం ఆధారంగా తీసుకొని కొన్ని సూచనలు చేశారు.

ఈయన దూరదృష్టిగల ఆదర్శవాది. వాస్తవిక దృష్టిగల రాజకీయవేత్త. తనలోగల ఈ రెండు సుగుణాలను మేళవించి అణ్వస్త్రయుద్ధవిధానంలో సాయుధబలాల నూతనపరిమాణం, అంతర్జాతీయ కూటాలు, ఐక్యరాజ్యసమితి మధ్యవర్తిత్వం, రహస్య బహిరంగ రాజనీతి, పాశ్చాత్య రాజ్యాంగ విధానాలపై ప్రాబల్యం గల అంతర్బాహ్యశక్తులు—ఈ విషయాలను గూర్చి చర్చించారు.

ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయ అధ్వర్యాన ఇచ్చిన స్టాఫోర్డ్ లిటిల్ ఉపన్యాసాలే ( 1955 ) ఈ పుస్తకరూపంలో వెలువడ్డాయి.



# లెస్టర్ బౌల్స్ పియర్సన్.

## కెనడా విదేశాంగ కార్యదర్శి-

ప్రఖ్యాత రాజకీయవేత్త. జననం 1897. టొరెంటో, పీటర్స్ బర్గ్, హేమిల్టన్, ఒంటారియో మొదలైన కెనడా దేశపు పట్టణాల్లో పాఠశాలల్లో విద్య నభ్యసించారు. మొదటి ప్రపంచ యుద్ధంలో సిపాయిగా చేరి తర్వాత లెఫ్టినెంట్ పదవి నందుకున్నారు. అటుపిమ్మట రాయల్ విమాన దళానికి బదిలీ చేయబడ్డారు. యుద్ధంతర్వాత టొరెంటో విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యనందిన పిమ్మట 'ఆక్స్‌ఫర్డ్'లో బి. ఏ. పట్టాన్ని సంపాదించారు. 'ఆక్స్‌ఫర్డ్'లో హాకీ, లాక్రోస్ మున్నగు ఆటల్లో ప్రతిష్ఠ గడించారు.

ఈయన కెనడా విదేశాంగ శాఖలో చేరింది 1928 లో. 1948 వరకూ ఆశాఖలోనే కార్యదర్శి పదవిని అధిష్ఠించినంతవరకు పనిచేశారు. 1945 లో అమెరికాకు కెనడాదేశపు రాయబారిగా నియమించబడ్డారు. 1949 కామన్‌వెల్త్ ముఖ్యమంత్రుల సమావేశంలో కెనడా ప్రధాని ప్రతినిధిగా పాల్గొన్నారు. ఉత్తర అట్లాంటిక్ సంధివ్యవస్థ (NATO) సలహా సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు.

ఐక్యరాజ్యసమితి నియమావళి తయారుచేసే సంఘంలో ఈయన కెనడావర్గపు సలహాదారులుగా వెళ్ళారు. ఐక్యరాజ్యసమితి సామాన్యసభ 3 వ సమావేశం నుండి 9 వ సమావేశం వరకూ తమ దేశవర్గానికి నాయకత్వం వహించారు. రాజకీయాలలో ఈయన అకుంఠిత ప్రజాసేవా పరాయణత్వం ఆయనకు ఖ్యాతి చేకూర్చింది. చివరకు ఐక్యరాజ్యసమితి 7 వ సమావేశానికి (1952-53) అధ్యక్షునిగా కూడా ఎన్నుకున్నారు.

# ముందుమాట

ఒకవైపు ఆశాజ్యోతికి, మరొకవైపు ఆందోళనకు గురి అయిన ఈ సంవత్సరంలో (1955) నన్ను 'స్టాఫోర్డ్ లిటిల్' ఉపన్యాసా లివ్వమని ఆహ్వానించడం గౌరవకారణంగా భావిస్తున్నాను.

ఈ ఆహ్వానంవల్ల నేను గ్రహించిందేమిటంటే 'నాకింకా పండితబృందంలో స్థానం ఉంది' అని. రాజకీయాలతో సతమతమవుతున్న నా వంటి వారందరకూ ఈ గౌరవం సమ్మతమే. అంటే 'రాజకీయాల్లోకి దిగజారిపోయాను' అని మీ కిప్పుడు క్షమార్పణ చెప్పుకోవడం లేదు. కాగా రాజకీయాల్లో ఉన్నందుకు గర్వపడుతున్నాను కూడా. రాజకీయాల్లో తాము పాల్గొనలేమని సమర్థించుకొంటూ కొందరు వేసిన అపనిందల వల్లనే వాటికి సముచితస్థానం రాలేదేమోనని నా అనుమానం. లేకపోతే రాజకీయరంగ ప్రాముఖ్యం ఇంతకంటె బాగా ఉంటుంది.

కొన్నాళ్ళపాటు నేను చారిత్రకోపన్యాసకునిగా పని చేశాను. దరిమిలా నా చారిత్రక విజ్ఞానం సన్నగిలిపోయింది. ఇక మిగిలింది నాలో ఉన్న ఒక దృఢమైన విశ్వాసం. ఈ నాటి జనానీకంలో చలామణీ అయ్యే మురభిప్రాయాలు మన మనస్సులపై దాడి చెయ్యకుండా ఉంటే వాటిని చారిత్రక

విజ్ఞానం తోను అనుభవంవల్ల చరిత్ర నిరూపించిన యదార్థాల వల్ల మనం పరిశీలించాలి. గడచిన యుగాల్లో ఊహామాత్రంగా నిలబడి ఆలోచించడం ఈ యుగసమస్యలను నిర్ణయించడానికి ఉత్తమమైన మార్గాల్లో ఒకటి విధీ విరామం లేక కార్యాంతర నిమగ్నులం అయిన మనకు ఆ యుగంలో సృష్టించబడ్డ ఉదాత్తమైన మానవ మేధస్సు మానవచైతన్యం పరిచయం చేసుకోవడానికి కావలసినంత అవకాశం ఉంది. అదీ కాకుండా మానవునిలో అంతర్లీనమయిన శక్తియుక్తులను గుర్తించడానికి కూడా అవకాశం ఉంది. ఇది కూడా ఒక ఉత్తమమార్గం.

విజ్ఞాన పరిశీలన పండితగోష్ఠితో నిండిన ఈ వాతావరణ పునఃప్రవేశంవల్ల నాకు కలిగిన సంతృప్తి, ఉపశమనం, ఇక్కడున్న పెద్దలకు అనేక సాధక బాధకాలతో నిండిన రాజకీయ రంగంలో ప్రవేశిస్తే రాదేమో అని నా అనుమానం. చిరకాలంనుండి నిశ్చలబుద్ధి దూరదృష్టి ఉపయోగించి తమ తమ చిక్కులను విడదీసుకొంటూ వస్తున్న ప్రజ్ఞావంతులు కూడా రాజకీయాలంటే భయపడతారు.

టొరెంటో విశ్వవిద్యాలయంలో నా సహాధ్యాయునిగా బ్రిబ్నర్ పండితుడొకాయన ఉండేవాడు. కొలంబియా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో ఉపన్యసిస్తూ రాజకీయ నాయకుల కార్యకలాపాలయెడ పండితులు చెందే వ్యాకులతనుగురించి సూటిగా మృదువుగా చెప్పిన ఆయన సూక్తులు గమనించదగినవి. రాజకీయరంగంలో వ్యక్తులు పోటీలుపడేది దేనికోసం అంటే భౌతిక ఆర్థిక సాంఘిక ప్రచారకశక్తులను కూడగట్టుకుందామనే. దీన్ని చూస్తేనే పండితబృందానికి భీతి. ఎందుచేత

నంటే రాజకీయాలు సత్వర ఫలితాలను ఆశించే వ్యాపకం, నిగూఢమై ఆచంద్రతారకమైన విశాలభావాలను ఆధారంగా కొన్న రాజనీతి చాలా అరుదు.

ఆ విశాలదృష్టితోనే ఉపన్యాసాలివ్వడానికి ప్రయత్నిస్తాను. కాని వాటికి పరిపూర్ణత నివ్వగలనా అన్న సంశయం నన్ను బాధిస్తోంది. ఇంతకు ముందు ఉపన్యాసాలొసంగిన యోగ్యుల శ్రేణిలో చేరగలనా అన్న భయంకూడా జనిస్తోంది. నాకు పూర్వం వచ్చిన వక్తలపేర్లను పరిశీలించాను. వారి విశాలదృక్పథం వారి విషయ సమన్వేచనాశక్తి, వారి ప్రతిభ నన్ను ముగ్ధుణ్ణి చేసింది.

సంస్కృతిమీద ఆలివర్ సెయింట్ గాగార్టి వ్రాసిన పుస్తకం (ఇన్‌క్రిడిబుల్ కల్చర్), అంతశ్శక్తిమీద విన్‌యుటాంగ్ పుస్తకం (రీజనబుల్ స్పిరిట్) చదవడం నాకు చాలా ప్రీతి. నడివయసులో ఆ పుస్తకాలు పఠించడం సమంజసం. తర్వాత మాస్కో పండితుని ఉపన్యాసాలువినవచ్చు! అదేసంవత్సరంలో విలియం బి ఇచ్చిన ఇంకొక ఉపన్యాసం వుంది. ఆ ఉపన్యాస శీర్షిక చూచినప్పుడు అంతర్జాతీయసమస్యలతో నేను వ్యవహరించేపద్ధతి స్ఫురిస్తుంది. ఆ శీర్షిక 'నాలుగువందల ఘాతాల లోతు' అన్నది.

పదిహేను ఇరవై యేళ్ళనాటి ఈ ఉపన్యాసాలధోరణి మారని మనసమస్యలను మన కార్యకలాపాలను ఎత్తి చూపిస్తోంది. "అరబ్బుల జాతీయతా విస్తరణ; దూరప్రాచ్యంలో కల్లోలపరిస్థితి", "అమెరికా ప్రభుత్వపు విదేశాంగవిధానం"— ఇవన్నీ నాటికీ నేటికీ ఒక్కటిగా ఉన్నాయి!

1935లో జాన్ ఫాస్టర్ డల్లెసుగారు 'నానాజాతి సంఘంలో శాంతియుత పరిణామం' అనే విషయంగూర్చి చర్చించారు. ఆ ఉపన్యాసం నేను తప్పక చదవాలి. ఇప్పుడు నేను "ప్రపంచ రాజకీయాలలో ప్రజాస్వామ్యం" (ఈ శీర్షిక క్రింద చెప్పకలసిన వెన్నో ఉన్నాయి) గూర్చి మాట్లాడాలని అనుకోడానికి ముందు – శ్రీ. శ. హెన్రీ స్టిమ్‌సన్‌గారు, ఇంకా మరో ఎనిమిది వక్తలు ప్రజాస్వామ్యపు వివిధములైన పోకడలను గూర్చి వివరించారని తెలిసి సంతోషించాను. ప్రజాస్వామ్యం అనే విషయం మనం ప్రతిదినమూ మాట్లాడుకొనేదే కాని చాలా క్లిష్టమైంది. ఇప్పుడున్నది నిజమైనప్రజాస్వామ్యమా అని కొంతమంది సంశయిస్తారుకూడా. నిజమైన ప్రజాస్వామ్యం నియంతలచేత వంచింపబడి ఆఖరికి ఆ పదంకూడా కలుషితమైపోయింది. 'సర్వజనసమ్మతమైన' విశేషణంకూడా చేర్చి నవ్వులపాలుచేశారు.

ప్రజాస్వామ్యానికి నాకు నచ్చిన నిర్వచనాన్నింతవఱకూ కనుగొనలేకపోయాను; కనిపెట్టలేకపోయాను. ఇంతవఱకూ అసంతృప్తినీ అసంపూర్ణతనూ కలిగించే నిర్వచనాలే విన్నాను; నినాదాలలో నైతేనేమి సర్వసాధారణంగా మాట్లాడుతున్నప్పుడైతేనేమీ అంతే.

ప్రజాస్వామ్యాన్ని ఎలా నిర్వచించినా దాని అర్థం మన మనస్సులలో బాగా అవగాహన చేసుకోగలం. కాని దాన్ని వ్యక్తపరచలేం. రాజకీయంగాను, సాంఘికంగాను అభ్యుదయానికి ప్రజాస్వామ్యం బాగా తోడుపడినా అది కలుషరహితంగా, దృఢంగాను పెరగాలంటే నిజాయితీతోను, తెలివి

తేటలతోను కూడిన ప్రతివ్యక్తిపరిశీలనా కార్యాచరణా చాలా అవసరం. వాగ్యుద్ధాలకు పరస్పర అభిప్రాయభేదాలకు గురి అయిన నేటి ప్రపంచంలో ఇది చాలా కష్టం. ఈ కల్లోలాన్నే ప్రజాస్వామ్య మనే దురభిప్రాయంకూడా ప్రబలిపోయింది. కష్టతరమైనా కాకపోయినా ప్రజాస్వామ్యాన్ని దృఢంగా పెంపొందింపజేయాలి. సైనికబలంతోను ఆర్థిక సుస్థిరత్వంతోనే కాకుండా మానసిక నైతికశక్తుల సహాయంతో ప్రజాస్వామ్యాన్ని పెంచాలి.

ఒట్టావా,
మే 7, 1955.

లెస్టర్ బి. పియర్సన్.

•

1

# నవీన పరిమాణంలో పాత సమస్యలు

గడచిన ఏబది ఏండ్లలో ప్రజాప్రాతినిధ్యంగల ప్రజాస్వామ్యం దురవస్థలకూ చివరకు ప్రాణాంతకమైన ఆపదలకూ గురి అయింది. సర్ విన్స్టన్ చర్చిల్ చెప్పినట్లు ఇది 'భయంకరమైన ఇరవయ్యవ శతాబ్దం'. ఈ శతాబ్ద పూర్వార్థంలో సమస్యలకు ఎదురు నిల్వడం ఎంత కష్టమైందో ముందున్న సమస్యలను ఎదుర్కోడం మనకంత కష్టమైన కార్యం.

ఈ సమస్యలు చాలవఱకు స్థూలంగా కనబడడంలో ప్రత్యేకత వహించినా అవి పాతపడిన సర్వసామాన్యమైన సమస్యలే.

ఈనాటి పెద్దపెద్ద సమస్యలనుచూస్తే వాటి పరిమాణం మనలను విషాద సాగరంలో ముంచివేస్తున్నట్లు కనబడుతుంది. అలాగ కానక్కరలేదు. సంగీతం తదితర కళల్లోనూ, గణిత వాస్తు శాస్త్రాలు మొదలైన వివిధ శాఖల్లోనూ పరిమాణానికి ప్రాధాన్యం లేదు. ప్రపంచ రాజకీయాల్లోనూ ఇంతే. విలువలూ పరిమాణాలూ కంటె మూలధర్మాలే ముఖ్యం. పరిమాణంలో సమస్యలు స్థూలంగా కనబడినప్పటికీ కొంచెం పరిశీలనా దృష్టితో చూస్తే అవి చిన్న చిన్న అంశాలుగా మన కవగాహన అవతవి.

నానాటికీ మన రాజకీయసమస్యల పరిమాణం హెచ్చుతున్నా, మానవజాతి ఎప్పటికైనా బ్రతికి బయట పడుతుందా అన్నంత ఉపద్రవాలను కల్గించినా ఈ సమస్యలలో ఉన్న సారాంశం ఏమీ క్రొత్తది మాత్రం కాదు. ఇంతకు ముందు మానవులు ఈసమస్యలను ఎదుర్కొన్నారు. అయితే దానివల్ల ప్రయోజనం ఏమైనా కలిగిందా లేదా అన్నది వేరే ప్రశ్న. చాలాసార్లు ఆ సమస్యలను పరిష్కరించారు. ఓడిపోయిన సందర్భాలూ ఉన్నాయి. ఈ సమస్యలను పరిష్కరించ లేకపోయినా, పరిష్కరించడములో ఏ తీవ్ర లోపం చేసినా మునుపటికంటె పెద్ద శిక్షనే ఇప్పుడు అనుభవించవలసి వస్తుంది.

గతంలో మన ఓటమి ఎక్కువ భాగం ఈ చిక్కులకూ, ఆపదలకూ కారణం. ఒక విచిత్ర విషయ మేమంటే గతంలో మనం సాధించిన విజయం కూడా ఈ చిక్కులకూ, ఈ ఆపదలకూ హేతువైంది. ముఖ్యంగా ప్రకృతిశాస్త్ర విషయంలోను, సాంకేతిక విజ్ఞాన విషయంలోనూ మనం సాధించిన అభివృద్ధి దీనికి కారణం.

వ్యక్తులకుగాని, సంఘాలకుగాని బ్రతుకుబాటలో ఒకే విశిష్టత ఉంది. ఎదుర్కొన్న సమస్యలను సాధించిన ఫలితం నూతన సమస్యలను సాధించడంలో అవకాశాన్నీ, అవసరాన్నీ కలిగిస్తోంది.

గతించిన అనుభవాల అంతరార్థాన్ని తెలుసుకొని, కొన్ని ప్రమాణాలను మనకు సహాయ భూతంగా చేసుకుంటే జయప్రదంగా మన గమ్యాన్ని మనం చేరుకోగలం.

అనివార్యమైన క్లిష్ట పరిస్థితుల పరిమాణం గ్రహించ డంలో, అన్నింటికీ ఆధారమైన సముచిత నిర్ణయానికి రావ డంలో ఈ గతానుభవం ఎంతో ఉపయోగిస్తుంది.

పాశ్చాత్య చరిత్రలో, దాని నాగరికతకు సంబంధించిన ప్రధానమైన రెండు ప్రమాణాలను సూచిస్తున్నాను. దానిలో మొదటిది: ఉద్యమానికీ, ఆశయానికీ వ్యక్తి మాత్రం కేంద్రంగా ఉండడం. దీనినే "మానవునకు మించిన కొల మానం లేదు" అని 2400 సంవత్సరాల క్రితం ప్రొటోగరస్ అనే గ్రీకు వేదాంతి ఒక సూక్తిగా వక్కాణించాడు. స్వేచ్ఛా యుతమైన సూక్ష్మబుద్ధికీ, చారిత్రాత్మక శక్తులకూ ఈ సూక్తి ఒక ప్రమాణం. అంతేకాదు గ్రీకు భావనలో గ్రీకు కళల్లో జరిగిన అభివృద్ధి ఇందుకు నిదర్శనం. ఇటీవల వెలసిన మానవోద్యమం, పునరుద్ధారణ, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ప్రాథమికంగా ఈ సూక్తిలోని అంతర్భావాన్ని వెల్లడించ డానికి తోడ్పడిన ఉద్యమా లనవచ్చు.

ఇక రెండవ ప్రమాణం ఏమంటే "మానవునకు కొల మానం ఏది" అనే ప్రశ్న. మానవుడే అన్నింటికీ కొల మానం అయినా అతనికికూడా ఒక కొలమానం లేకపోలేదు. దీనితో అతనిని పరీక్షించడానికి కూడా వీలుంది. నైతిక ఆధ్యాత్మికమైన విలువలే ఆ కొలమానం. అందులో ఒకటి: విశ్వజనీనకం. రెండవది కాల పరిస్థితులకు అతీతమైంది అని అనవచ్చు.

మన నాగరికతను తీర్చిదిద్దిన పెద్దల ఆశయాలు ఆద ర్శాలు ఒక దానితో ఒకటి సంబంధం లేకుండా రకరకాలుగా

వున్నాయి. అయితే పైన చెప్పిన ఆ రెండు ప్రమాణాల్లోని అంతర్దృష్టి వారందరిలో ఒక్కటే. అదే వారి ఆశయాల్లో ఒక సమన్వయాన్ని తెస్తోంది.

మనం పై రెండు ప్రమాణాలను సూత్రప్రాయంగా ఉపయోగించ లేకపోయినా రాబోయే సమస్యలకు సరియైన సమాధానం స్ఫురింప జేసేందుకు ఆ సమస్యలను పరిష్కరించ డానికి చేసే ప్రయత్నాలకు ప్రేరేపణ శక్తిగా తప్పక తోడ్ప డతాయి.

ఈ విషయాలను గూర్చిన ఒకటి మాత్రం ఏమీ క్రొత్తది గాదు. అంతర్జాతీయ రాజకీయాల్లోని శాశ్వతమైన లక్ష్యాలు మహనీయుల హృదయాల్లో నాటుకొని వున్నాయి. ఈ సత్పురుషులు, ఇరుగు పొరుగు వారి మధ్య సఖ్యతనూ సహవాసాన్ని పెంపొందించడమే వారి ఆశయ సిద్ధిగా పెట్టుకొన్నారు.

కాని అందరి ఉద్దేశాలు ఇవి కాకపోవచ్చు. అందరికీ ఈ లాటి అభిప్రాయాలు ఎప్పుడూ ఉండవు. శాంతి సహకా రాలవంటి శక్తి సంఘర్షణలకు ప్రాధాన్యం ఇచ్చేవాళ్ళున్నారు. రాజకీయాలూ సంఘం ఈ లక్ష్యాలమీద తప్ప ఇంక ఏ తదితర లక్ష్యాలమీద ఆధారపడి ఉండవని కొందరంటారు. ఈ విష యంలో నేను ఆశావాదిని. మునపటికంటె ఇప్పుడు ఎక్కువ మంది సుహృద్భావం కల మహనీయు లున్నారని నమ్ము తున్నాను. అంతేకాదు. సాంకేతిక విజ్ఞానంలో, శాస్త్రవిష యంలో కొనసాగుతున్న అభివృద్ధితోబాటు ఆ మహనీయుల సంఖ్యకూడా తరగకుండా పెరుగుతోందని నా దృఢవిశ్వాసం.

ఎరిచ్ ఫ్రోమ్ 'స్వాతంత్ర్యభీతి' (Fear of Freedom) అనే తన ఉద్గ్రంథంలో ఈ ఆశావాదాన్ని ఈ క్రిందివిధంగా వెలిబుచ్చాడు.

"ఇన్ని క్రౌర్యాలు, ఇన్ని వినాశాలు చరిత్రలో ఎలా ఉన్నాయా అని ఆశ్చర్యపోనక్కరలేదు. మనం నిజంగా ఆశ్చర్యపడవలసింది మనకు ఉత్సాహం నూరిపోసేదీ ఒకటుంది. మానవజాతి అష్టకష్టాలపాలైనా మానవుడు మాత్రం గౌరవ ప్రతిష్ఠలు, దయాదాక్షిణ్యాలు, ధైర్యస్థైర్యాలు మొదలైన ఉదాత్తగుణాలను వదలేదు. ఆ మేటి గుణాలను అభివృద్ధి పరచుకన్నాడు. ఇప్పటికీ అనేకులలో ఈ మేలిగుణాలే విరివిగా కనిపిస్తున్నాయి."

ఇంతవఱకూ సామీప్యం అనే పదానికి వ్యక్తులు, విషయాలు, వస్తువులకు సంబంధించిన దూర పరిమాణాన్ని బట్టి అర్థం చేసుకుంటున్నాం. ఈ శాస్త్రవిజ్ఞానాభివృద్ధి ఫలితంగా సామీప్యం అన్నదానికి అర్థం కేవలం సంకుచితదృష్టితో కాకుండా ప్రపంచ పరిణామంతో పోల్చి చూడవలసివచ్చింది. కాబట్టి దీనితోబాటు మానవులలో సుహృద్భావం సఖ్యత లలో అంత విశాలదృక్పథం ఏర్పడాలి. అనగా శాస్త్రాభి వృద్ధిలో ఎంత ఉన్నతపథం అందుకున్నామో సఖ్యత సుహృద్భావాలలో దానికి అనుగుణంగా అంతలోతుకు పోవాలి.

ఈ ఖండంలో ఈ సమస్యను పరిష్కరించాం. రెండు దేశాలమధ్య ఇది సాధించడం గర్వప్రదమైన కారణంగా నేను భావిస్తున్నాను. అమెరికా సంయుక్తరాష్ట్రాలు కెనడా మధ్య

చాలా స్వాభావికమైన ఈ సహకారం సాన్నిహిత్యం ప్రపంచమంతటా విస్తరింపజేయవలసి ఉంటుంది.

ఇప్పటికే ముందంజవేశాం. సమిష్టికృషివలన దేశభద్రత కాపాడుకొనడం, వెనుకబడిన దేశాలకు సాంకేతిక ఆర్థికసహాయం చేయడం మొదలైన ఘనకార్యాలు .మనం సక్రమమైన మార్గంలో నడుస్తున్నామని తెలుపుకున్నాయి. ఇంకా ముందుకు పోవలసి ఉంది. అది కష్టతరమైంది.

మానవ సంబంధబాంధవ్యాలు వాటి సమస్యలు (రాజకీయాలంటే ఇంకా ఏమిటి?) స్థూలపరిమాణాంలో ఏ విధంగా గోచరిస్తున్నాయో కొన్ని ప్రాంతాలలో అప్పుడే మనం చూడగలుగుతున్నాం. అందులో మొదటిసమస్య: రాజనీతి సాధనగా మానవులకు లభించే ఆయుధబలాల పరిమాణం. రెండవది: రాజకీయవిధానాలకు ఏర్పరచే రాజకీయసంఘాల పరిమాణం. నేడు రాజకీయతంత్రానికి సంబంధించిన సమస్యలు కేవలం నాగరికతకూ నాగరికతకూ నడుమనేకాని దేశంలో రాష్ట్రానికీ రాష్ట్రానికి మధ్యకాదు. వీనిలో కొన్నిసమస్యలు మానవానీకానికి సర్వసామాన్యమైనవే. ప్రజాస్వామ్యసంఘాలలో భవిష్యత్తువిషయంలో శ్రద్ధతీసుకొనేవారిది నిర్ణయశక్తిగలవారి సంఖ్య వెనుకటికంటె నేడు ఎక్కువ.

ప్రపంచ రాజకీయాలు – ప్రజాస్వామ్యం అనే విషయాలకు సంబంధించినంత మట్టుకు ఈ ప్రమాణపరిమాణాల అర్థమేమిటో పరిశీలించడానికి ప్రయత్నిస్తాను.

# శక్తులు : వాటి పరిమాణాలు

మారణశక్తినిగూర్చి వెలువడుతున్న చిత్రమైన విషయాలు విస్తృతపరిమాణంలో ఒక పెద్దసమస్యను తెచ్చిపెడుతున్నాయి. ఈ అణుశాస్త్రం కొందరు వ్యక్తులకీ, కొన్ని ప్రభుత్వాలకీ విపరీతమైన మారణశక్తి నిచ్చింది. ఈ శక్తి అచిరకాలంలోనే ఇంకా చాలమందికి హస్తగతం అవుతుంది.

ఈ మారణశక్తి పరిమాణం క్రమక్రమాభివృద్ధి చెందుతున్నకొద్దీ, రాజకీయవిధానసాధనలో అనేకమైన మార్పులు వస్తున్నాయి. అందుకే నేటిసమస్యలను తక్షణమే పరిష్కరింపబడవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

అధికారంలో ఉన్నవాళ్ళు కాని, తదితరులు కాని ఒక విషయాన్ని సరిగ్గా అవగాహన చేసుకుంటున్నారా అని నా అనుమానం. ఇప్పుడిప్పుడే వెలువడి ఇంకా సంపూర్ణాధీనంలోకి రాని ఈ నూతన భౌతికశక్తి ప్రపంచరాజకీయాలమీద ఎలాటి ప్రభావం చూపెడుతుందో దానిఅంతరార్థం సరిగ్గా తెలియదు. ఏమాత్రం సూక్ష్మబుద్ధితో చూచినా ఒక ముఖ్యవిషయాన్ని గుర్తింపవచ్చు. మానవజాతి శాంతియుతంగా, క్షేమకరంగా జీవనం సాగించాలంటే ఏ ఆశయసిద్ధి శ్రేయస్కరమో అసలు మానవజాతి బ్రతకాలంటే ఆ ఆదర్శాలే అత్యంత ఆవశ్యకం.

కొన్నికొన్ని ముఖ్యవిషయాలు హానికరం కాదుకదా అని ఆనాడు అలక్ష్యంచేసి ఆలోచించకుండా వదలివేశాం. ఈనాడు ఆ విషయాల గురించి తీవ్రంగా ఆలోచించవలసి ఉంటుంది.

చరిత్ర ప్రారంభంనుండి ప్రతివ్యక్తికి ఆత్మహత్య చేసుకొనే శక్తిసామర్థ్యాలు ఉన్నాయి. ఆ శక్తిసామర్థ్యాలతోనే మనం జీవించడం నేర్చుకున్నాం. ఇప్పుడు మనం చరిత్రలో ఏ దశకు వచ్చామంటే; ఏదయితే వ్యక్తిగతంగాను ఆధ్యాత్మికంగాను నిజమో అదే ప్రాపంచ విస్తృతమైన సాంఘికరాజకీయ విషయాల్లోనూకూడా నిజమయ్యే దశకు వచ్చాం మానవజాతి బ్రతికి ఉండాలంటే ఈ విషయాలలోగల రాజకీయ ముఖ్యాంశాలను అంగీకరించడమే కాకుండా కార్యాచరణలోకూడా పెట్టవలసి ఉంది. దీనికి మొదటిమెట్టు పరిస్థితుల స్వరూపభావాలను గుర్తించడం, దానికనుగుణంగా విధానాలను మార్చుకోవడం. ఈ విధానాలకు మూలకారణాలు, ఫలితాలు అంతర్జాతీయమైన స్థాయిలో ఉండాలి.

సాంకేతిక యదార్థవిషయాలను గ్రహించడమే మనకు కష్టమైన కార్యం. ఈ విషయాలవలన అంతర్జాతీయ ధార్మిక సూత్రాలలో ఒక విప్లవంచెలరేగుతుంది. నా ఊహాలో కొన్ని ఏండ్లవఱకు మనం కని విని ఎఱుగని ప్రచండమైన ఆయుధం ఏదంటే 10 టన్నుల టి యన్ టి (T N T) (ప్రేలెడుశక్తి) ఉపయోగింపబడిన బాంబు. హిరోషీమాలో ప్రయోగించిన అణ్వాస్త్రం 20000 వేల టి యన్ టి శక్తికి సమానం. అనగా అణ్వాస్త్రశక్తి వెయ్యిరెట్లుపెరిగిందన్నమాట. ప్రస్తుతపు ఉదజని

బాంబులో ఈ అణ్వాస్త్రశక్తి ఇంకొక వేయిరెట్లు అధికం. అందువల్ల ఉదజనిబాంబుశక్తిని మెగాటన్ను (ఒక మెగాటన్ను పదిలక్షల టన్నులకు సమానం) లతో కొలవవలసి వచ్చింది. ఒక మెగాటన్ను శక్తిగల ఉదజనిబాంబుకీ మామూలు ఉదజని బాంబుకీ ఉన్న తేడా ద్వితీయ ప్రపంచ సంగ్రామంలో ప్రయోగించిన "సాంప్రదాయక"మైన ఆయుధాలకూ ఏటంబాంబుకూ ఉన్న తేడావంటిది. ఈ విధంగా విధ్వంసకశక్తులతో మనం ఎదుర్కొనవలసి ఉంటుంది. ఇదేనా పర్యవసానం? 35 ఏండ్ల క్రితం రైటు ఆనరబుల్ ఎస్క్విత్ అను నామె శాస్త్రజ్ఞానం "సర్వనాశనానికి నాందిప్రస్తానగా దారితీస్తుంది" అని చెప్పింది. ఆ మాట నిజమౌతుందా?

ఈ ఉదజనిబాంబుల విధ్వంసకశక్తి భయానకమైనది. కాని ఈ బాంబు శక్తివలన కొన్ని వేల చదరపుమైళ్ళవఱకూ వ్యాపించిన రేడియో యాక్టివ్ వాయువుల దుష్ప్రభావం మరింత ఘోరమైంది.

దుష్ఫలితాలు అటుంచి, కొన్ని వందల ఉదజనిబాంబులు ప్రేలడంవలన కలిగే రేడియో యాక్టివ్ విషవాయువుల ఫలితంగా కొన్ని లక్షలాది ప్రజలు ఘోరవ్యాధులతో తరతరాలూ బాధపడవలసిందే.

ఇంకొక విషయ మేమంటే మనతరంలోనే అమెరికా సంయుక్తరాష్ట్రాలు, రష్యా, ఇంగ్లండురాజ్యాలే కాక తదితర దేశాలకుకూడా ఈ అణ్వస్త్రాలను తయారుచేయగలశక్తి ఉంది.

ఈ విధ్వంసకశక్తులవలన ఉద్భవించినసమస్యలు పరిష్కరించాలంటే ఆ సమస్యలలోగల రాజకీయ దేశరక్షణ విషయా

లను సంబంధించిన ముఖ్యాంశాలనుగూర్చి బాగా ఆలోచింప వలసి ఉంటుంది. అంతేకాదు. ఈవిషయంలో మనం అదివఱకు ఏర్పరచుకొన్న అభిప్రాయాలను పునః పరిశీలించవలసిఉంటుంది.

ఈ విషయంలో అణ్వస్త్రాల మారణశక్తియే ఘోర యుద్ధాన్ని అరికట్టడానికి కాని అసలు యుద్ధమే లేకుండా చేయ డానికి గాని సాధ్యమవుతుందని కొందరభిప్రాయపడుతున్నారు. మానవజాతిని సర్వనాశనం చెయ్యడానికి బదులు యుద్ధాన్నే ప్రతిఘటిస్తుంది. ఏనాడైతే ఒక పక్షంవారికి ఇంకొక పక్షం వారిని అణ్వస్త్రాలతో హతమార్చడానికి శక్తిసామార్థ్యా లుంటాయో, ఒక వేళ శత్రువులు అణ్వస్త్రాలు ప్రయోగించినా ప్రతీకారచర్య తీసుకొనుటకుగాను అణ్వస్త్రస్థావరాలు దేశం నలుమూలల ఉంటాయో ఆ నాడు ఎవ్వరూ యుద్ధానికి కాలు దువ్వరు. ఆ విధంగాయుద్ధం ప్రారంభించడం వినాశహేతువే. ఉభయపక్షాలవారికి దృఢమైన ఇచ్ఛాశక్తి ఉన్నప్పుడు, ఇరు పక్షాలవారు బుద్ధిమంతులు లోకజ్ఞానం కలవారు అయితే ఈ అణ్వస్త్రాలు నిజంగా యుద్ధ నిరోధకమే కావచ్చు. అయితే క్రూరుడూ మూర్ఖుడూ అయిన హిట్లర్ వంటివారి విషయంలో ఇది సాగే పనికాదు. కాని కేవలం క్రూరుల విషయంలో కొంతవఱకూ పనిచేయవచ్చు.

కొన్నాళ్ళక్రితం మాలంకోవ్ కూడా తన ఉపన్యాసా లలో ఇంకొక ప్రపంచ సంగ్రామమే సంభవిస్తే ప్రపంచ నాగ రికత నామరూపాలు లేకుండా పోతుందని ఒప్పుకున్నట్లు మనకు తెలుస్తోంది. అందుకు 'ప్రావడా' పత్రిక అతనిని మందలిం చింది. అంతేకాకుండా ఇప్పుడు కమ్యూనిస్టులు మళ్ళా వారి

ప్రచారం మార్చి ప్రపంచ సంగ్రామమే వస్తే కమ్యూనిజమే విజయం సాధిస్తుందనీ, ధనికవర్గాలవారు సర్వనాశనం అవతారని ఒక వింత ప్రచారం సాగిస్తోంది.

ఈ విధంగా ప్రచారం సాగుతే కొన్నాళ్ళకు రష్యా వారు ఈ 'స్వయంబోధ' పద్ధతి మూలంగా దీనినే విశ్వసించే అపాయం లేకపోలేదు. కాని నా ఉద్దేశంలో క్రిమ్లిన్‌లోని నాయకులు లోకజ్ఞానంలో అంత శైశవదశలో ఉన్నారని అనుకోను. ఈ ఉదజని బాంబు యుగంలో రష్యా ప్రజలు భౌతికంగానే కాదు; రాజకీయంగాకూడా మనతోనే ఉన్నారు. ఒక విధంగా చూస్తే ఇది 'సహజీవనం' అనవచ్చు. వాళ్ళకుకూడా ఈ సత్యం తెలుసునని నేను విశ్వసిస్తున్నాను. పరస్పర భయాందోళన కారణంగా నయినా ఈ సత్యాన్ని గుర్తించి వారు సఖ్యతకు రావచ్చు.

ఇంకా విప్లవ విజయ తన్మయత్వంలో ఉండి, ప్రపంచానికి ఏదో మహా సందేశాన్ని అందిస్తామనే భ్రాంతి కల చైనా కమ్యూనిష్టు నాయకుల భావనచూస్తే పెద్ద ప్రమాదమే ఏదో ఉన్నట్లు గోచరిస్తోంది. అణ్వాస్త్ర యుద్ధమే సంభవిస్తే వారికి అంతగా ప్రమాదమేమీ ఉండదని, తమ జాతీయశక్తి సంఘ వ్యవస్థలు కొనసాగుతూనే ఉంటాయని వారు నమ్మినట్లు కనబడుతున్నారు. అణ్వాస్త్రాల ప్రయోగంవల్ల చైనా ఆ తాపుకు తట్టుకుంటుంది కాని దెబ్బమాత్రం తినదు. చైనా యుద్ధంలో పదికోట్లమందిని పోగొట్టుకున్నా యింకా జనాభాలో 50 కోట్లమంది బ్రతికే ఉంటారు. పాశ్చాత్య దేశాల విషయంలో ఇది కుదురదు.

ఇంకొక దృక్పథంలో చూస్తే సర్ విన్స్టన్ చర్చిల్ తదితరుల ప్రకారం మునుపటి ఆయుధాలకంటె ఈ ఉదజని బాంబుకు ఉభయ పక్షాలను ఉద్ధృతంగా సరిసమానంచేస్తుంది. ఆ బాంబుకు ఆ ప్రాంతం ఈ ప్రాంతం అనే విచక్షణ లేదు. సైన్యాలను కంటె ప్రదేశాలనే సర్వనాశనం చేస్తుంది. దేశాలనే కాకుండా ఖండాలనే నమసింప జేస్తుంది. ప్రతి బాంబు కొన్ని వేల చదరపు మైళ్ళ విస్తీర్ణాన్ని - దానిలోని జనాభాతో సంబంధం లేకుండా - నివాస యోగ్యరహితంగా చేయు గలదు. దీనినిబట్టి ఈ ఉదజని బాంబు భౌగోళిక రాజకీయాలకు ఒక నూతన అర్థాన్ని కల్పిస్తోంది. రాజకీయ సైనిక వ్యూహాలను ఒక నూతన దృక్పథంలో చూడవలసిన అవసరం కల్గిస్తోంది.

ఇట్టి పరిస్థితుల్లో ఒకరినొకరు పిచ్చి పిచ్చిగా బెదిరించుకోవడం, భేషజాలకు పోవడం వెర్రితనం. ఇట్టి ప్రచ్ఛన్న యుద్ధంవల్ల శాంతి భద్రతలు నెలకొనవు. పూర్వం ఒకరి మీద ఒకరు కత్తులు దూసుకోవడం ఎంత అవివేకమో ఈనాడు ఈ ఉదజని బాంబులు ప్రయోగిస్తామని బెదిరించడమూ అంతే. ఉదజని బాంబూ ద్వేషం కలుస్తే అది దుష్టసంయోగం అవుతుంది. ఇప్పుడున్న క్లిష్టపరిస్థితుల్లో రాజకీయ నాయకులు, సైనికాధికారులు విచక్షణాజ్ఞానం నశించేటంతగా ఉద్రిక్తపడడం ఏమీ భావ్యం కాదు. వారి అభిప్రాయాలు కార్య రూపంలో పెట్టేముందు కొంచెం ఆలోచించాలి.

కమ్యూనిష్టు నాయకులంటే గొప్ప దూరదృష్టితో పన్నాగం పన్నే కుట్రదారులని, ఎంతో నిగ్రహశక్తిగల చదరంగపు ఆటగాళ్ళని పాశ్చాత్యులలో చాలమంది అభిప్రాయం. నిజమే. కమ్యూనిష్టు నాయకులలో కొంతమంది అలాంటి వాళ్ళే. అయితే దీర్ఘనిస్పృహవలన వారిలో ఉద్భవించిన కామక్రోధాలు, భావోద్రేకాలు వారి రాజకీయ వ్యవస్థలో అంతర్భాగాలుగా ఉండవచ్చు. ఈ నూతన శక్తితో కమ్యూనిష్టు నియంతలు చెలగాటం ఆడే అపాయం ఎప్పటికీ ఉంది. అదే విధంగా ప్రజాస్వామ్యాలు కూడా సహనం నిగ్రహశక్తి కోల్పోయి భయాందోళనవలన అవివేకమైన విధానాలకు దారితీయవచ్చు. దీనివలన అనుకోకుండానే దుష్ఫలితాలు రావచ్చు.

ఇంకొక వైపునుండి కూడా అపాయం కలిగే అవకాశం వుంది.

దూర ప్రాచ్యదేశంలో కొందరు ప్రభుత్వ నాయకులు తమ తగాదాలలో తక్కిన దేశాలను ఇరికించడానికి ప్రయత్నిస్తారు. ఈ విధంగా అయితేగాని వారు తలపెట్టిన జాతీయ విధానాలకు విజయం లభించదు. వారు తలపెట్టిన మార్గాలను గర్హించినా వారి ఆదర్శ ప్రాయమైన గమ్యాలపట్ల మనం సానుభూతి చూపవచ్చు. ఈ గమ్యస్థానా లేమిటంటే కమ్యూనిష్టుల హస్తగతమైన రాజ్యభాగాలను ఆ భాగ ప్రజల స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందడమే. ఆ విధంగా ఆ గమ్యాలు చేపట్టుకోవాలంటే పూర్వ విరోధాలను రేకెత్తించడమే ప్రాధాన్యంగా పీరు తలుస్తారు. అంతేకాదు. ఈ విషయంలో

పాశ్చాత్య దేశాలు కొన్ని వీరికి అండగా ఉంటాయని వీరి అభిప్రాయం. ఈ దేశాలకు సంబంధించిన ఆసియా ఖండం ప్రభుత్వాల ప్రజాస్వామ్య సిద్ధాంతాలను అమలు పరచడంలో లోపాలున్నా, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అరికట్టినా, కమ్యూనిష్టు రాజ్యాలతో యుద్ధం తలపెట్టి ఆ రాజ్య భాగాలను విముక్తి చేయడం ప్రజాస్వామిక పోరాటమేనని వీరి ఉద్దేశం. అనగా కమ్యూనిష్టు నిరోధక మైనది ప్రతిదీ ప్రజాస్వామికమే నని దీని భావం. ఈ సిద్ధాంత ప్రకారం హిట్లర్ అందరికీ మించిన ప్రజాస్వామిక వాది అవుతాడు. కాబట్టి ఈ వాదా నికి అర్థం లేదు.

ఈ అణ్వస్త్రాలు కాలక్రమేణ అన్ని దేశాలవారు తయారు చెయ్యడమే ప్రారంభిస్తే ఈ అపాయాలు ఇంకా ఎక్కువ కావడానికి అవకాశం ఉంది. నేను పైన చెప్పిన పరిస్థితుల ప్రోద్బలం వల్లనైతే నేమి ఈ అణ్వస్త్రాలు కొన్ని దేశాల వారికి సంపూర్ణాధీనంలో ఉంటేనేమి దానివలన కలిగే ఫలితాలు ఏ దృష్టితో చూచినా లాభదాయకాలు కావు.

ఈవిధంగా అణ్వస్త్రాలు ప్రపంచం అన్ని దేశాలలో ఉండడంవల్ల ప్రస్తుతం ప్రచారంలో వున్న "సర్వనాశన ప్రతీ కారచర్య" అనే సిద్ధాంతాన్ని కూడా తారుమారు చేస్తుంది. కొన్ని సందర్భాలలో ఇదే మనకు ఆశాజ్యోతి కావచ్చు. అదీకాక ప్రపంచాన్ని రెండే రెండు రాజకీయ విభాగాలుగా చేయవచ్చుననే పునాదిపై ఈ సిద్ధాంతం ఆధారపడి వుంటుం దికాని ఇది కేవలం పరిస్థితులను సూక్ష్మీకరించి సులువుగా తేల్చివేయటమే.

పది పన్నెండు దేశాలలో ఈవిధంగా ఉదజని బాంబు లను ఉత్పత్తి చేయడం, వాటిని "ఖండాతర్గాములు" ద్వారా ప్రయోగించి ఏ దేశంలో ఏ స్థావరాన్నైనా నాశనం చేయ గల సర్వసామర్థ్యం ఉన్నప్పుడు ఇట్టి నిరోధక విధానాలు ఎన్ని ఉన్నా ఏమి ప్రయోజనం ?.

దేశీయాధిపత్యానికి సంబంధించిన సిద్ధాంతాల్లోను వాటి కార్యాచరణలోను ఈ అణ్వస్త్రాల ఉత్పత్తి, వాటి ప్రయోగం ఏ విధమైన ప్రభావం చూపుతాయో జ్ఞప్తికి తెచ్చు కోవడం మంచిది. జాన్ స్టూవర్ట్ మిల్ అనే మహానీయుడు ప్రసిద్ధికెక్కిన "స్వాతంత్ర్యంమీద ఒక వ్యాసం" అనే పుస్త కంలో స్వాపేక్షా పరాపేక్షలకు దైనిక కార్యాచరణలో గల తారతమ్యాన్ని విశదీకరించినమాట అందరికీ తెలిసినదే. సాంఘిక భద్రతలకు అనుగుణ్యంగా వ్యక్తిగత స్వాతంత్ర్యం నిలబెట్టుకోవడానికి ఈ పైన చెప్పిన తారతమ్యమే ఆయన రాజకీయ సూత్రాలకు పునాదివంటిది. అదే విధంగా మన సాంఘిక భద్రతకు అనుకూలంగా దేశాధిపత్యనిర్వచనంలో ఇదివరకు చేసిన మార్పులువంటివే ఇంకా కొన్ని మార్పులు చేయవలసి ఉంటుందేమో. ప్రపంచంలో అనేక దేశభక్తులు దేశాభిమానులు, జాతీయవాదులు ఉండవచ్చు. కాని ఏ మాత్రం లోకజ్ఞానం ఉన్నవాళ్ళయినా ప్రతి చిన్న దేశం ఈ అణ్వస్త్రాలను తయారుచేసి నిల్వచేసుకోవడం ప్రయోగించడం వారి దేశాధిపత్య సిద్ధాంతానికి అర్థం అని వాదించరు.

ఇవి వర్తమాన సమస్యలు కాకపోవచ్చు. ఎప్పుడో రాబోయే సమస్యలనుగూర్చి యిప్పుడే తహతహలాడడం

ఉబుసుపోక చేసే పని కావచ్చు కాని యీ సమస్యలు ఊక దంపుడు చర్చలకు సంబంధించినవి మాత్రం కాదు. సాధారణంగా ఇవాళ సమస్యకాని రేపటి సమస్యకాని తీవ్రాలోచనతో పరిష్కరించవలసినదిగా ప్రజాదృష్టిని ఆకర్షిస్తోంది.

కాని ఒక ముఖ్యమైన సమస్యనుమాత్రం ఇవాళో రేపో మనం ఎదుర్కొనవలసి ఉంది. ఈ విషయంలో ఒక తప్పుడు అభిప్రాయం చాలమంది కున్నది. మారణశక్తి విషయంలో అన్ని అణ్వస్త్రాలు సమానమేనని కాబట్టి ప్రపంచ సంగ్రామంలో తప్ప యీ అస్త్రాలు ప్రయోగార్హాలు కావని చిన్న చిన్న యుద్ధాల తరహాయే వేరని అవి అంత ప్రమాదకరమైనవి కావని వాటిని సులువుగా పరిమితం చేయవచ్చునని వీరి ఉద్దేశం.

ఈ వాదన కొన్ని సందర్భాలలో అంగీకరించవచ్చు. కొన్ని లక్షల టన్నుల టియన్‌టికి సమానమైన ఉదజని బాంబులే ఉన్ననాడు వాటిని ప్రయోగించినప్పుడు సమూల నాశనమౌతుందని అన్ని పక్షాలవారు పరస్పరం గుర్తించినపుడు అందరూ ఒక కట్టుబాటుమీద మారణాస్త్రాలు ప్రయోగించకుండా ఉండవచ్చు.

కాని యీ పరిస్థితులలో ఒక చిక్కువుంది. మారణశక్తి విషయంలో ఉదజని బాంబుకి తక్కువ పరిమాణంలో ఉన్న చిన్న చిన్న అణ్వస్త్రాలు కూడా ఉన్నాయి. దీనివల్ల క్రొత్తగా యింకొక బెడద వచ్చింది.

అధ్యక్షుడు ఐసన్‌హోవరు 1955 మార్చి 16 న ఈ విధంగా అన్నారు. "కేవలం సైనిక లక్ష్యాలకు, సైనికోప

యోగాలకి మాత్రం ప్రయోగించినప్పుడు యీ చిన్న అణ్వా స్త్రాలు ఎందుకు వాడకూడదో నాకు అర్థం కావడంలేదు." కాబట్టి యీ చిన్న అణ్వస్త్రాలను ప్రాంతీయ యుద్ధాలలో కాని ప్రపంచ సమరాలలోకాని ఉపయోగించరనుట వాస్తవం కాదు.

విమానాశ్రయాలను రవాణాసౌకర్యాలను సర్వనాశనం చెయ్యాలంటే చిన్నచిన్న అణ్వస్త్రాలకు ఎన్నివిమానాలు ఎందరు వైమానికులుఅవసరమో సాంప్రదాయక ఆయుధాలను ఉపయోగించదలచుకుంటే వాటికి ఏభై లేక వందరెట్లు కావలసి వస్తుంది. కొన్ని కొన్ని సందర్భాలలో ఈ చిన్న అణ్వస్త్రాలు ప్రయోగించనిపక్షంలో శత్రువులకు సైనికబలం ఎక్కువగా ఉన్నప్పుడు వారు క్రూరులైనప్పుడు యుద్ధంలో వారిదే పైచేయి కావచ్చు.

దేశాలకు అణ్వస్త్రాల సంపత్తి ఉండి చిన్నచిన్న యుద్ధా లలోనైనా పెద్దపెద్ద యుద్ధాలలోనైనా అవి ప్రయోగిస్తారని మనం తెలుసుకొన్నట్లయితే కొన్ని ముఖ్యవిషయాలను నిర్ధా రణచేసుకొని పరిశీలించవచ్చు.

అందులో మొదటిది : సముచితమార్గాలలో అన్ని విధాలా ఎటువంటి తగాదాకూడా తలఎత్తకుండా నిరోధించడం ఆవశ్యకం. చిన్నదీవిలో మొలకెత్తిన యుద్ధం ప్రపంచమంతట వ్యాపించవచ్చు. ఒకపక్షంవారు ప్రత్యర్థుల సైనికస్థావరాలమీద అతి నైపుణ్యంతో అణ్వస్త్రాలు ప్రయోగిస్తే అవి భయకంపిత ద్వేషపూరిత వినాశకరదృష్టితో నిర్దాక్షిణ్య ఉద్రిక్తులై ప్రతి పక్షులు ఉదజనిబాంబులతో వ్యూహంపన్నడానికి దారితీస్తుంది.

భయం అపాయం ఎదుర్కొన్నప్పుడు స్వేచ్ఛాజీవులు ఎప్పుడూ వెనుదిరగాలని నా ఉద్దేశంకాదు. అలాగ ఒకప్పుడు తమసైన్యాలను సాభిప్రాయంగానే వెనుకకు మళ్ళించి ఆ ప్రాంతం ప్రతిపక్షులకు అప్పగించినా శాంతిస్థాపనకు అది ఏవిధంగాను దోహదం కాదు. పైగా దీనివలన ఫలితం ఏమంటే ఒకపక్షం వెనుదిరిగి వెళుతున్నకొద్దీ ప్రతిపక్షులు వేంటాడుతూ అప్రయత్నంగా ఆచోటు ఆక్రమిస్తూ వస్తూఉంటారు. చివరకి ఈచొరవ యిచ్చినవారికే పై బడి ప్రతిపక్షం వారిని ధ్వంసం చెయ్యాలన్నంత క్రోధం పెల్లుబుకుతుంది.

సైనికోపసంహారణ అవసరమైనదని తోచినప్పుడు అసలు సంఘర్షణలకు కారణాలు కనుక్కొని ఆ సంఘర్షణలు విచారించుటకు ప్రయత్నాలు చెయ్యాలి. ఈవిషయంలో కొరియాలో జరిగినట్లు తటస్థప్రదేశాలను ఏర్పాటు చేయడం మొదలైనవి మిగత రాజ్యాలవిషయాలకు సంబంధించిన సమస్యల పరిష్కారానికి వినియోగించవచ్చు. అదేవిధంగా సంధులు ఒడంబడికలు బలప్రయోగ నివారణకు ఉపయోగించవచ్చు.

ఈ విధమైన సాధనసంపత్తిని ప్రాజ్ఞులు త్రోసిపుచ్చరాదు. దీనివలన కాలం వృధాకాకుండా అసలుసమస్యల పరిష్కార విధానానికికూడా దోహదం కల్పించవచ్చు.

ఇట్టి తాత్కాలికచర్యలు అవసరమైనా అసలుసమస్యల పరిష్కారానికి ఇవి అడ్డంకులుగా ఉండకూడదు. ఈవిషయంలో అసలు అపాయం రాజకీయం వల్లనేకాని సాంకేతిక విజ్ఞానవిషయాలవల్ల రాదని మనం మర్చిపోకూడదు. ఈ సమస్యలు సాంకేతిక విజ్ఞానవికాసంవల్ల జనించినవి; అణ్వస్త్ర ప్రయోగశక్తుల

వల్ల కాదు. కొన్ని శతాబ్దాలుగా మారణ అస్త్రశస్త్రాల శక్తులను వాస్తగతంచేసుకొని ఉభయపక్షాల బలాబలాలు పరీక్షించుకొనే రాజకీయ వేత్తలకు సంబంధించినవి.

కాబట్టి మన శక్తియుక్తులు అనవసర అణ్వస్త్రమారణ ప్రయోగవిధానాలు వాటి విధానసాధనలతో వ్యర్థంచెయ్యక అంతర్జాతీయసమస్యల పరిష్కారమార్గాలు వాటికి తగిన అనుకూల వాతావరణపరిస్థితులు ఏర్పరచుటకు ప్రయత్నం చెయ్యాలి.

యుద్ధం మనలను పరిసమాప్తం చేసేలోగా మనమే దాని అంతం చూడాలి. అదీ మన ఆశయం. అంటే శత్రువులను మిత్రులుగా చూచుకోవాలి. కత్తులు నాగళ్ళుగా ఉపయోగించాలి. మనకు ఒకవిధంగా కష్టంగా తోచినా ఈ సమస్యల పరిష్కారపద్ధతులు మనలను చాలవఱకు నిరుత్సాహపూరితులుగా చేసినా హింసాకాండ రాజకీయరంగంలో పనికిరాదు అనేదశకు మానవజాతి వచ్చిందని మనం నచ్చచెప్పవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

మానవజాతికి మోక్షసాధన అహింసయే అనే సిద్ధాంతాన్ని ప్రచారంచెయ్యడం వాస్తవానికి దూరంకావచ్చు. అంతమాత్రాన హింసాకాండను తగ్గించి అహింసాసిద్ధాంతాల మీద ఎక్కువశ్రద్ధాభక్తులుంచి మానవజాతి ఎందుకు పురోగమించకూడదో అర్థం కావటంలేదు. అదేవిధంగా హింసావిధానాలలో మానవజాతి పురోభివృద్ధిని చూపించవచ్చు.

ఈ నాగరికతా ప్రపంచంలో అణ్వస్త్రాలప్రయోగం నిరుపయోగమని అన్నిప్రభుత్వాలవారుకూడా వారి రాజకీయ

సమస్యాపరిష్కారాలకి హింసాకాండ అనాగరికత అని, అపాయకరమని గుర్తిస్తారని మన ఆశ. కాని భావి నాగరికత ఈ స్వయం నిగ్రహశక్తిమీదనే ఆధారపడి ఉంటుందని చెప్పలేము.

ఈ విధానాలతోబాటు మనశక్తియుక్తులనుబట్టి సరిసమాన సిద్ధాంతా (Doctrine of Proportion) న్ని పెంపొందించడానికి ప్రయత్నించాలి. మన ఎదుటి కక్షివారికి కూడా ఈ సిద్ధాంతమే మంచిదని వాస్తవిక దృష్టినిబట్టి నచ్చచెప్పాలి. ఒకవేళ నీపై బలప్రయోగం జరిగినా అంతకు సరిసమానమైన శక్తినే నీశత్రువుపై ప్రయోగించాలి. కాని అంతకంటె అధిక బలప్రయోగం అసమర్థనీయం. దీనిని మీరు సరిసమాన సిద్ధాంతమనవచ్చు. సర్వనాశన ప్రతీకారచర్య సిద్ధాంతం (Massive retaliation) వలె దురాక్రమణను అరికట్టడానికి ఇది నూరుపాళ్ళ సమస్యాపరిష్కారం కాకపోవచ్చు. కాని ఆ సమస్యల పరిష్కారవిధానాలలో ఇదికూడా ఒకటని గుర్తించాలి.

ఈ విషయంలో మారణశక్తి సహజగుణాన్నే కాక దాని ప్రమాణాన్నికూడా గుర్తించాలి. నేటి ప్రజావాహిని ఈ అణుమాయలోపడి ఈ అణుశక్తుల పుట్టు పూర్వోత్తరాలనుగూర్చి ఆలోచిస్తున్నారే కాని అణువునుండి ఉద్భవించిన శక్తియొక్క పరిమాణం గూర్చికాని, దానిని సద్వినియోగపరచే మార్గాలగూర్చికాని అంతగా ఆలోచించడం లేదు. దీనివలన ఎంతైనా అపాయం వాటిల్లగలదు.

కొన్ని ప్రత్యేకమైన పరిస్థితులలో ఏ రకమైన శక్తిని ప్రయోగించడం అతిముఖ్యమో నాకు తెలుసు. తిరిగి రెండవ

సారి అణ్వస్త్రం అనే పేరుతో ఆసియా భూభాగంమీదకాని,
ఆసియా నివాసులమీదకాని ఏది ప్రయోగించినా ఒక దురభి
ప్రాయానికి దోవ తీస్తోంది. అణ్వస్త్రాలు తెల్లజాతికి సంబం
ధించి ఒక ప్రత్యేక మానవజాతిని నాశనంచేయడానికై సృజిం
పబడిన భీకరశక్తి అని కొన్ని లక్షలాది ప్రజల అభిప్రాయం.
మనం యెన్నివిధాల తాత్కాలికంగా కాని సాంకేతికంగా కాని
ఆధ్యాత్మికంగా కాని ఎన్ని కారణాలు చూపించినా ఆ దురభి
ప్రాయాలను తొలగించడం వీలుపడదని కూడా నాకు తెలుసు.

ఈ ప్రతిక్రియ చాలా ముఖ్యం. అణ్వస్త్రప్రయోగం
ఒక ప్రత్యేకప్రదేశంలో ఒక ప్రత్యేక పరిస్థితిలో చేయవచ్చునా
లేదా అన్న నిర్ణయానికి ఇది అత్యంతావశ్యకం. కాని కొన్ని
పరిస్థితులలో కొన్ని ప్రదేశాలలో సహేతుకంగా ఉన్న ఈ
వాదన సర్వసామాన్యంగా తలపోయడం అతి అపాయకరం.

అణ్వస్త్రాలు అసలు ప్రయోగించరనే మన ఆశ.
దీనితోబాటు మర తుపాకులు, శతఘ్నులుకూడా వాడరని
మన ఆశ. అయితే అణ్వస్త్రప్రయోగం అది దారితీసే హింసా
కాండకన్న దాని జుగుప్సాకరమైన పరిమాణం వల్ల అణ్వస్త్ర
ప్రయోగానికి అందరూ ఏకగ్రీవంగా అసమ్మతిని తెల్పవచ్చు.
కాని సాంప్రదాయానుసారంగా వస్తున్న ఆయుధప్రయోగాలు
ఆక్షేపణీయాలు కాదని వాదించుట అపాయకరం. ఒక వ్యక్తిని
చంపడానికి బాణమైతేనేమి? తుపాకి గుండైతేనేమి? అణ్వస్త్ర
మైతేనేమి? శక్తిని వినియోగపరచడమే గర్హనీయంకాని ఆ
శక్తియొక్క భౌతిక ఉత్పత్తి అప్రస్తుతం.

ఒక కిలోటన్ను ప్రేలుడు శక్తిగల ఒకే అణ్వస్త్రాన్ని ఒకే విమానంలో పంపుటకీ, పది టన్నులు విలువగల కొన్ని వందల సాంప్రదాయ ప్రేలుడు సాధనాలు కొన్ని వందల విమానంలో పంపుటకీ తేడాలున్నాయి కాని ఆ తేడాలు కేవలం సాంకేతికమైనవి; రాజకీయమైనవి; మానసికమైనవి. నీతికి అవినీతికి సంబంధించినవి కావు.

ఏ రకమైన ప్రేలుడు సాధనమైనా ప్రయోగించవచ్చు కదా అని, ఒక విమానాశ్రయాన్ని కాని, ఒక సైనిక స్థావరాన్ని కాని, ఒక యుద్ధనౌకనుకాని నాశనం చేయుటకు (ప్రపంచ సంగ్రామ పరిస్థితులలో తప్ప) కొన్ని లక్షల టన్నుల విలువ గల ఉదజని బాంబును కొన్ని లక్షలాది ప్రజలు నివసించుచున్న భూభాగాలపై వేయడం ఏ విధంగా సమర్థనీయంకాదు. ఈ విధంగా నేను చెప్పినదానికీ సర్వనాశన ప్రతీకారచర్య సిద్ధాంతానికీ కొంత సంబంధం ఉంది.

కాబట్టి సర్వనాశన ప్రతీకార చర్య సిద్ధాంతాన్ని గూర్చి, యుద్ధనివారణ ప్రతిక్రియల సిద్ధాంతాలను గూర్చి అదివఱకు మనం అలవాటుపడిన భావాలను పునఃపరిశీలించడం మంచిది. ఒకవిధంగా ఈ సర్వనాశన ప్రతీకార చర్య సామర్థ్యం కల్గివుండటం మంచిదే. శత్రువు దురాక్రణ చేయడానికి ఎప్పుడు తలపెడతాడో, ఆ దురాక్రమణవల్ల విజయం త్వరగా సాధించవచ్చునని అతడెప్పుడు దురభిప్రాయం పడతాడో ఆ సందర్భాలలో ఈ ప్రతీకార చర్య అత్యంత ఆవశ్యకం కూడ. అయితే ఈ సర్వనాశన ప్రతీకార చర్యవల్ల మనం ఒక చిన్న తగాదాకాని, ఒక చిన్న ప్రదేశంలోగల

యుద్ధంకాని ఆపగల్గుదుమా అన్నది వేరే ప్రశ్న. అలాటి సిద్ధాంతాన్నే మనం ఆమోదిస్తే ఒక యుద్ధనౌకనుకాని, ఒక చిన్న ద్వీపాన్నికాని శత్రువులు నాశనం చేసినపుడు వారిని సర్వనాశనం చెయ్యడానికి ఉదజని బాంబులు వేయవచ్చునా అనే నిర్ణయంపై ప్రపంచ భవిష్యత్తు ఆధారపడి వుంది.

ఈవిధమైన సర్వనాశన ప్రయోగం లేదా ప్రయోగించకపోవడం అన్న విషయ పరిస్థితుల్లో మునిగి తేలవలసి వుంటుంది ఇరుపక్షాలవారు అణ్వస్త్రాలను కల్గివున్నప్పుడు శత్రుపక్షం పెద్దయెత్తున దురాక్రమణ సాగించినప్పుడే సర్వనాశన ప్రతీకారచర్య అనుకూలాగా ఉంటుంది కాని ఇంకే ఇతర పరిస్థితులలోనైనా దుస్థితిని కల్గిస్తుంది.

నా ఊహలో ఈ సిద్ధాంతం ఎప్పుడూ కూడా అసమ్మతనీయమే. ఇలాటి ఒక ప్రాత సిద్ధాంతాన్ని గూర్చి ఆలోచిద్దాం. అదే 'దెబ్బకు దెబ్బ' అనే సిద్ధాంతం. ఇది అందరకూ తెలిసినదే. కాని వ్యక్తిగత విషయంలో ఈ సిద్ధాంతం ప్రాత రాతియుగపు నాటిదని, ఆటవికమైందనీ మనం సర్వసాధారణంగా అనుకుంటున్నాం. నిజమే. వున్నత నైతిక దృక్పథంతో ఆలోచిస్తే అంతే. కాని నైతిక దృక్పథంలో కూడా తక్కువ స్థాయి లున్నాయి. ఆ నైతిక దృష్టిలోంచి చూస్తే సరిసమాన సిద్ధాంతంకన్న ఇంకా నీచమైన పైశాచిక సిద్ధాంతాలూ వున్నాయి. "నేరానికి మించిన శిక్ష" అనే సిద్ధాంతాన్ని అమలు పరచినపుడు వ్యక్తుల విషయంలో ఆ సిద్ధాంతంవల్ల మానవ జాతికి శ్రేయస్సు కలుగలేదు. మూడు వేల సంవత్సరాలకు పూర్వం "నేరానికి తగిన శిక్ష"

అనే సిద్ధాంతాన్ని మోసస్ నిర్వహించి నప్పటికీ నేరానికి మించిన శిక్ష వేయుడం మంచిదని, ఒక గొత్రెనుదొంగిలించినం దులకు ఆ దొంగను ఉరికంబం ఎక్కించేవారు. ఈవిధంగా నైతిక స్థాయిలో దిగజారి పోయారు. కాని నేడు అలాంటి కృత్యాలు విరమించుకొని తిరిగి ఉన్నత నైతిక స్థాయికి పోగలిగారు.

పరిస్థితులకు అనుగుణంగా ఆశయ సంసిద్ధికి అవసర మైనంతగా బలప్రయోగం చేసే సిద్ధాంతం స్వయం సంరక్ష ణార్థం సమర్థనీయమే. ఇది ప్రకృతి ధర్మంలోనే వుంది. ఈ సిద్ధాంతం నాగరికతా ప్రపంచంలో అన్ని ధర్మాలకు మొదటి మెట్టు.

ఈ సూత్రాన్నే న్యాయాధిపతి మార్టెన్‌గారు సేస్ కేచు వన్ కోర్టు ఎపీలులో మేక్ నెయిల్ - హిల్ అనే కేసు విష యంలో మా దేశానికి సంబంధించిన న్యాయచట్టాన్ని వివ రిస్తూ ఈ విధంగా చెప్పారు.

"స్వయం సంరక్షణార్థం బలప్రయోగం చేయవచ్చు అన్న వ్యక్తిగతమైన హక్కును న్యాయశాస్త్రం గుర్తిస్తుంది. కాని ఏ హక్కునూ దుర్వినియోగం చేయకూడదు. ఈ స్వయం సంరక్షణార్థం ఉన్న హక్కును చాలా సులువుగా దుర్విని యోగం చేయవచ్చు. పరిస్థితులకు మించి స్వయం సంరక్ష ణార్థం బలప్రయోగం చేయకూడదు."

కెనడా క్రిమినల్‌కోడ్‌లో 66 వ సెక్షన్‌లో ఈ విధంగా వుంది.

"చట్టానుగుణ్యంగా, అధికారరీత్యా బలప్రయోగం చేయు ప్రతివ్యక్తి ఒక చర్యయొక్క స్వభావానికి, విశేషానికి మించిన బలప్రయోగం చేసినా ఆ చేసిన వ్యక్తి ఆ నేరానికి బాధ్యుడు"

ఈ సూత్రానికి సంబంధించిన ఉదాహరణ స్టేటు వెర్సస్ సీఫస్ అనే కేసులో సంయుక్తరాష్ట్ర న్యాయచట్టంలో యింకొక దృష్టాంతం ఉంది.

"దుండగాన్ని నిరోధించడానికి కాని ఎదుర్కొన్నప్పుడు కాని ఒక కార్యానికి అవసరమైన బలప్రయోగంకన్న అధిక బలప్రయోగం చెయ్యరాదు. ఆ దుండగానికి గురి అయిన వ్యక్తి తన స్వాయం రక్షణార్థం కావలసినంతకంటె ఎక్కువ బలప్రయోగం చేస్తే ఆ వ్యక్తియే అపరాధి అవతాడు".

ఇదే సూత్రం ఆంగ్లేయుల న్యాయచట్టంలో ఉంది. "ఇంగ్లాండు దేశ న్యాయచట్టాలు" అనే గ్రంథంలో 418 పుటలో ఈ విధంగా ఉంది.

"చట్టరీత్యా ఒక వ్యక్తి స్వయం రక్షణార్థం కాని తన నివాసరక్షణార్థం కాని దురాక్రమణ చేసేవానిని చంపేలోపుగా వెనుదీయడంకాని లొంగిపోవడం కాని అనవసరం. అతనిని వెంటాడవచ్చు. ఆ వ్యక్తిని బంధించడానికి ప్రయత్నించవచ్చు. కాని దురాక్రమణదారుడు లొంగిపోయికాని నిరాటంకంగా పారిపోయేటప్పుడు కాని చంపబడితే ఆ చంపిన వ్యక్తిమీదనే హత్యానేరం మోపబడుతుంది"

ఈ సూత్రాన్నే ఫ్రాన్సు దేశ న్యాయచట్ట డాలజ్ విజ్ఞానసర్వస్వం యీ క్రిందివిధంగా వివరిస్తోంది.

"రక్షణ ముట్టడికి అనుగుణంగా ఉండాలి. అధికం పనికిరాదు. ఆస్తి సంరక్షణవిషయంలో ఇది అతిప్రాధాన్యం. కొన్ని ప్రత్యేకపరిస్థితులలో తప్ప స్వయం సంరక్షణార్థం జరప బడు అధిక బలప్రయోగాలు సమర్థనీయాలు కావు"

"డొనాల్డ్ డి వేబ్రస్—డ్రాయిట్ క్రిమినల్" అనే పుస్తకంలో 233 పుటలో ఈ విధంగా ఉంది.

"ఒక వ్యక్తి ముట్టడింపబడినాడు అన్న విషయాన్ని ఆధారంగా తీసికొని ఆ ముట్టడించినవానిపై మితిమీరిన క్రౌర్యం చూపమని న్యాయరీత్యా లేదు."

ఐక్యరాజ్యసమితివారి పత్రంలో 51 వ నిబంధన ప్రకా రం వ్యక్తి లేదా సమిష్టిసంరక్షణార్థం ఉన్నహక్కుకు సంబంధిం చిన సూత్రాలు పరిమితం అని మనం గుర్తించాలి. ఉత్తర అట్లాంటిక్ సంధి వ్యవస్థ, మనీలా ఒడంబడిక పరస్పర సహాకార అంతర్ సంయుక్తరాష్ట్ర సంధివ్యవస్థలు తదితర రక్షణసంధి ఏర్పాట్లు 'స్వేచ్ఛాజగతికి' సంబంధించినంతవఱకూ ఆధారపడి ఉన్నాయి.

నాగరకతా సంఘంలోగల ఈ స్వయం సంరక్షణార్థం ఉపయోగపడు శక్తిప్రమాణం దురాక్రమణదారుని అను మతితో కాని లేక అతని సహకారంతో కాని నిమిత్తంలేదు. నాగరికులు అయినవారు ఈ సిద్ధాంతాన్ని నాగరికతకోసమే వినియోగిస్తారు. ఒకవేళ హింసాకాండ ప్రారంభమైనా ఈ

సిద్ధాంతం జ్ఞాపకం ఉంచుకుంటే ఆ హింసాకాండ ప్రపంచంలో వ్యాపించకుండా శాంతిభద్రతలను కాపాడడంలో బాగా పనిచేస్తుంది.

ఒకవేళ ఏదైనా ఒక దేశంపై దురాక్రమణ జరిగితే ఆ దేశం తనమిత్రులసహాయంద్వారా – అంతేకాదు యావత్ స్వతంత్రజాతి సహాయంతో కూడా ఐక్యరాజ్యసమితి పత్రప్రమాణానికి అనుగుణంగా దురాక్రమణను ప్రతిఘటించడానికి సమిష్టి ప్రయోగం చేయవచ్చు. అయితే దీనిఅర్థం ఆ దురాక్రమణదారుని ఆ వ్యక్తికి సంబంధించిన సంఘాన్ని కాని మితిమీరిన బలప్రయోగంచేసి సర్వనాశనం చెయ్యమని కాదు.

అయితే ఈ సిద్ధాంతాన్ని ఒప్పుకుంటే దురాక్రమణదారులు పెచ్చుమీరుతారనీ వారి విజయకాంక్షలకు అంతు ఉండదని వాదింపవచ్చు. నిత్య దైనికజీవితంలో అట్టి విషమ పరిస్థితి ఎన్నడూ ఏర్పడలేదు. అదేవిధంగా రాజ్యాలవిషయాలలో కూడా విషమపరిస్థితి ఏర్పడనక్కర్లేదు. ఏది ఎల్లాగున్నా అలాటి సిద్ధాంతం ఒకటి లేందే ఒక వ్యక్తివల్ల నైతేనేమి, కొంతమంది వ్యక్తులవల్ల నైతేనేమి మానవజాతి విషాదపరిస్థితికి గురి కావలసివస్తుంది.

ఈ బలప్రయోగ పరిమితిసిద్ధాంతాన్ని ఆధారంగా చేసికొని ఈమధ్య "శాంతిఅభేద్యం" అనడం పరిపాటైపోయింది ఒక దృష్టితో చూస్తే ఇది ముమ్మాటికి నిజమే. కాని ఇంకొక విధంగా ఆలోచిస్తే ఇది తప్పు. ప్రపంచంలో ఏ మారుమూల చిన్నతగాదా ప్రారంభం అయినా ఆ విషయం అన్ని దేశాల వారికి ముఖ్యమైనదే అనే విషయంలో ఈ మాట ఎంతో

సత్యం. ఎందుచేతనంటే ఒక ప్రదేశంలో అశాంతి ఏర్పడినపుడు అది ప్రపంచమంతా వ్యాపించవచ్చు.

అయితే ఈ శాంతి అభేద్యం అనే ఊహాగానం ఒక విధంగా తప్పేకాదు; అపాయకరం కూడ. శాంతి అభేద్యం అన్న మాటకు – ఒకప్రదేశంలో ఆరంభమైన తగాదా తప్పక ప్రపంచమంతా వ్యాపిస్తుంది ఈ ఉద్దేశాన్ని పురస్కరించుకొని ఆ దృష్టితోనే ప్రతి సమస్య పరిష్కరించాలనే అర్థం అయితే నిజంగా ఇది అపాయకరమే. ఇలాటి చిక్కు ఎప్పుడూ ఉన్నదే. ఆ సందర్భంలో ఈ సిద్ధాంతాన్ని కార్యాచరణలో పెట్టినట్లయితే ప్రతి చిన్న విషయానికి కూడా పెద్ద పరిమాణంలో బలప్రయోగ చర్యలు తీసుకోవాలి అన్న దృష్టి ఏర్పడుతుంది కాబట్టి ఈ సిద్ధాంతంవల్ల అసలు సమస్యలు పరిష్కరింపకపోగా లేని చిక్కులు తెచ్చి పెట్టుకోవడమే అవుతుంది.

ఈ సందర్భంలో సాంప్రదాయాను సారంగా వస్తున్న సైనిక, రాజకీయ సిద్ధాంతాలకంటె ప్రభుత్వాధికారుల స్వబుద్ధియే మేలనిపించింది. ఎందువల్లనంటే కొరియా యుద్ధాన్ని వ్యాపించకుండా అణచడంలో, ఇండోనేషియాకు సంబంధించిన తగాదాలను హద్దుమీరనీయకుండ చేయడంలో అరబ్బులకు, ఇస్రేయులకు మధ్య యుద్ధం మితిమీరకుండా చేయడంలో ఈ సంగతి సర్వవిదితమే.

మన ఆధ్యాత్మిక ప్రవక్తలు సర్వ మానవజాతి ఒకే కుటుంబానికి చెందినదని ప్రబోధించారు. ఆ విధంగా చెప్పడం అలంకార ప్రాయమే. సర్వ మానవజాతి ఒకే దేహానికి

సంబంధించినది. ఈ సంగతి ఆధ్యాత్మిక విషయంలోనే కాకుండా సాంకేతిక పురోభివృద్ధిలో కూడా యదార్థమని తెలుస్తోంది. ఈ మానవ కుటుంబం బ్రతకాలంటే ఈ ఏకత్వంలోగల అంతర్భావాలను సరిగా తెలుసుకొని తదుపరి కార్యాచరణలోకి దిగవలసి వుంటుంది. ఈ మానవజాతి ఒకే దేహమైనపుడు అందులో ఒక వ్రేలు తెగిపోతే మొత్తం చేతినే ఖండించ వలసిన అవసరం లేదు. అలా చేయడంలో అర్థం లేదు. బైబిల్ గ్రంథంలో కూడా ఒక చిన్న హానికి ప్రాణాన్నే తీయమని ఎక్కడా లేదు.

కొన్ని పరిస్థితుల్లో ఏరకమైన బలప్రయోగం చెయ్యాలి అనే సిద్ధాంతం, తదితర పరిస్థితుల్లో అపరిమిత బలప్రయోగం చెయ్యాలి అనే సిద్ధాంతం నిర్వచించినమాత్రం చాలదు. ఈ సిద్ధాంతాలతోబాటు బలప్రయోగం చేసి దానివలన మనం సాధించు లక్ష్యాలనుగూర్చిన సిద్ధాంతంకూడా తెలుసుకోవాలి.

ఈ సందర్భంలో మామూలువాడుకలో ఉన్న ఇంకొక విషయంకూడా పరిశీలించవలసి ఉంటుంది. అది "యుద్ధలక్ష్యం విషయమే" అనే మాట. ఇది కొంతవఱకూ నిజం కాని పూర్తిగా ఇది సత్యం కాదు. మానసిక తమోవృత్తిని కప్పిపుచ్చడానికి ఈ ప్రచారాలు సులువుగా దారితీస్తాయి. ఈ మాటనే నూటికి నూరుపాళ్ళు నమ్మితే పాశ్చాత్య ప్రజాస్వామ్యవాదాలు గడచిన రెండుప్రపంచయుద్ధాలలో నమ్మినట్లు ఇది దీర్ఘకాలంపట్టే హింసాకాండకుదారితీస్తుందని విశ్వసించాలి. అలాగే దాన్ని నమ్మితే శత్రువు సంపూర్ణంగా లొంగేవఱకూ

ఆ శత్రువును సర్వనాశనం చేసేటంతవఱకూ సైనికవ్యూహం వన్నుతూనే ఉండాలి, అంటే దానివలన యుద్ధాలలో గెలుపు శాంతిని సాధింపలేకపోవడం జరుగుతుంది. విజయం కంటె యుద్ధలక్ష్యం శాంతియే.

ఈ కారణాలవల్ల యుద్ధాలమధ్య మునిగిఉన్నా విజయ స్థాపనకే కాక తదుపరి లక్ష్యసాధనలలోకూడా మనం కళ్ళు తెరచి చూడాలి. ఇందులో ఒకవిషయం జ్ఞాపకం ఉంచుకోవాలి. నియంతృత్వపరిపాలనలు, అనిష్టకరమైన రాజకీయ సిద్ధాంతాలు తాత్కాలికాలు. కాని మానవజాతిమాత్రం ఈ గోళంమీద జీవంవున్నంతకాలం బతికేఉంటుంది. కాబట్టి ఈ ప్రజాకుటుంబంలో అర్థంలేని వ్యర్థమైన తగాదాలు తెచ్చుకోవడం తెలివితక్కువ.

కొన్నికొన్ని పరిస్థితులలో శత్రుబాధల వలన, దుష్టచేష్టల వలన ప్రజలు తాత్కాలికంగా ఉద్రేకపూరితులు కావచ్చు. ఆవిధమైన ఆవేశాలకు అర్థం ఉంది, అది సమర్థనీయంకూడ. అయితే నాగరికతనే సర్వనాశం చేసే మహాశక్తిని చాల ప్రభుత్వాలు పొందిన ఈ యుగంలో సామరస్యానికి దారిచూపు రాజకీయ నిపుణత అత్యంత ఆవశ్యకమని మరవకూడదు.

ఒకవేళ యుద్ధాలేవస్తే దురాక్రమణ వనికిరాదని ఋజువు చేయడమేకాదు. ఆ దురాక్రమణను ఎదుర్కొని ఓడించడమే కాదు. ఆ యుద్ధాన్ని హద్దుమీరనీయకుండా చూడడం లక్ష్యసిద్ధి అయినవెంటనే యుద్ధం ఆపడం, యుద్ధం ఆగిన వెంటనే శాంతికొఱకు పనిచేయడం మున్నగునవికూడా అవసరమే.

తృప్తికరంగా లేనట్లు తోస్తుంది. గడచిన రెండు ప్రపంచ సంగ్రామాల్లో స్వేచ్ఛాజగతికి సంబంధించిన ప్రజాభిప్రాయాన్ని తిలకిస్తే మరాక్రమణదారునిపై అంతులేని ద్వేషం ప్రబలింది. ముట్టడిని ఎదుర్కొనడంలో ఆగక ఆ విద్వేషం ధర్మస్థాపనకు సాగించు మతయుద్ధంగా మారింది.

యుద్ధం సాగేటప్పుడు ఆ యుద్ధ ఫలితం తేలనప్పుడు రాజకీయ లక్ష్యాలను గూర్చి ఆలోచించడం ప్రజాస్వామికంలోగల ప్రజాభిప్రాయాన్ని చీల్చడమే. ఆ లక్ష్యాలను గూర్చిన ఆలోచన పనికిరాదు. వీటివలన యుద్ధకాలంలో శత్రువును సర్వనాశనం చేయడానికై నిరంతరం ప్రయత్నించడంవల్ల యుద్ధానంతర సమస్యలు అధిక మౌతున్నాయి.

ఈ సందర్భంలో మనకు తెలిసిన రెండు అనుభవాలు స్ఫురణకు వస్తాయి. మొగెన్తా పథకం ప్రకారం జర్మనీ దేశాన్ని వ్యవసాయ ప్రధాన దేశంగా మార్చడం మంచిదని తలపోశాం. కాని వాస్తవంగా పునః సాయుధ జర్మనీ దేశాన్ని ఆహ్వానించాం. 1945 లో ఒక రాజకీయ ఉద్రేకంలో జపాను దేశాన్ని శక్తిహీనంగా చేయదలచాం. కాని 1955 లో గల రాజకీయ సంక్షోభంలో ఆ దేశం సాయుధంగా ఉండాలని హెచ్చరించాం. రెండు దేశాల మధ్య శాశ్వతమైన పోరాటం ఎప్పుడూ వుండదు. అదే విధంగా అస్పష్టమైన రాజకీయ లక్ష్యాలను సాధించడానికి సాగించిన యుద్ధంవలన స్థిరమైన శాంతి ఎప్పుడూ సమకూడదు.

అయితే ఈపైన చెప్పిన వాటికి ఒక నిపాతం వుంది. ఒకవేళ దురాక్రమణ దారుడు మన నాగరికతా ప్రపంచంపై మనలను సర్వనాశనం చేయడానికై ఉదజని బాంబు ప్రయోగిస్తే మనం ఆ శత్రువులపై అపరిమిత బలప్రయోగం చేసితీరుతాం. ఆ సందర్భంలో మన శత్రువు ముట్టడి యుద్ధనేరం కన్న అతిక్రమిస్తుంది. అది ఆత్మహత్యా దోషం కూడా. ఈ పరిస్థితుల్లో సర్వనాశన ప్రతీకారచర్య అత్యంత అవసరమైన నిరోధంగా ఉంటుంది. ప్రస్తుత పరిస్థితిలో దానికంటె గత్యంతరం లేదు. అయితే ఇదిమాత్రం శాంతియుద్ధాల సమస్యలకు శాశ్వతమైన పరిష్కార మార్గం కాదు. ఉదజని బాంబు పైననే ప్రపంచ శాంతి ఆధారపడి ఉందనడం ఎవరికీ తృప్తికరంగా లేదు.

ఉదజని బాంబులతో సర్వనాశనం తలపెట్టడం ఒక విషయం. దురాక్రమణ తక్కువ ప్రమాణంలో జరుగుతే దానిని ఎదుర్కొనే రాజకీయ సైనిక బలప్రయోగం హద్దు మీరి పోకూడదు.

ఈ విషయంలో 18, 19 శతాబ్దాలలో గలవారే బుద్ధి చాతుర్యం మనకన్నా ఎక్కువ చూపారు. వారు నిరంతరం విశిష్టమైన లక్ష్యసాధనాలకు యుద్ధం సాగించారు. ఆపై జరిగిన శాంతి ఒడంబడికలు చాలవరకు సామరస్యంతోనే వున్నాయి. అంతేకాక ఎక్కువ బలం కలవారికి కొన్ని లాభాలు కల్గేవి.

ఈ విషయం విపరీతంగా కనపడవచ్చు. ఆ శతాబ్దములో జరిగిన యుద్ధాలలో రక్తపాతం కూడా తక్కువే. ఫలితాలు కూడా బాగా వున్నాయి.

ఈ రెంటి విషయాలలో కూడా 20 వ శతాబ్దంలోగల ప్రజాస్వామ్య మతయుద్ధాలు వాటికి సరిపోలవు. ఈ శతాబ్దంలో ప్రతి చిన్న విషయం ప్రపంచ పరిమాణం పొందుతుంది. యుద్ధంకాని, అస్త్రాలుకాని, రాజకీయ చతురతగాని, జయాప జయాలుకాని, ప్రతీకారంకాని, ప్రజల భావోద్రేకాలుకాని ప్రపంచ పరిమాణంలో పరిగణించవలసి వచ్చింది. దురదృష్ట వశాత్తు మానవుని విజ్ఞానం, దూరదృష్టి ప్రపంచ పరిమాణంలో లేవు.

గతించిన శతాబ్దాలలో, యుద్ధాలు జరుగుతున్నప్పుడు సైతం లాభనష్టాలుగూర్చి ఆలోచించుకొని, సంధికూర్చుకొని యుద్ధం విరమించడానికి సాధ్యమయ్యేది. అయితే ఈ కాలంలో ఒక యుద్ధం ప్రారంభించి ఆ యుద్ధం ధర్మస్థాపనకై సాగిస్తున్న మత యుద్ధమని అనుకొంటే సంధిచేసుకొనడం కూడా ఒక మహాపాతకమే అవుతుంది. చారిత్రాత్మకంగా కూడా విశిష్టమైన రాజకీయ లక్ష్యాలయందు మనసుంచి పోరాడినప్పుడే యుద్ధాలను విరమించడానికి సాధ్యమయ్యేది.

ఏ యుద్ధమందైన, ఏ దేశం అయినా బేషరతుగా లొంగవలెననడం ఎంతమాత్రం స్వచ్ఛమైన రాజకీయలక్ష్యం కాదని నా అనుమానం. ఒకవేళ అది ప్రజాభిప్రాయంలో అయి ఉండుగాక. ఏది ఎల్లాగున్నా అంతర్జాతీయ రక్షకభటచర్య విషయంలో ఇది ఎంతమాత్రం తగదు. పరస్పరం సర్వ

నాశనం అయ్యే పరిస్థితుల్లో తప్ప 'స్వేచ్ఛాజగతి' యొక్క బలప్రయోగం ఎప్పుడూ కొన్ని విశిష్టమైన రాజకీయ లక్ష్యాలకే వినియోగించాలి. అందులో ముఖ్యమైంది దురాక్రమణను పేర్కొవడం ఆ దురాక్రమణ పెచ్చు పెరిగితే దానిని హద్దుమీర నీయకుండడం, దానిని అరికట్టడం, ఆ తదుపరి శాంతిస్థాపనకు మార్గాలు వెదకడం.

ఈ సర్వనాశన ప్రతీకారచర్య సిద్ధాంతానికి సంబంధించినది ఇంకొకటి ఉంది. దురాక్రమణదారుని శిక్షించడంకంటె స్వాతంత్ర్య స్థావరాలను రక్షించడం మరొక యుద్ధాన్ని నిరోధించడం, ఈ విధానంలోగల మూలాభిప్రాయాలు.

దీనికి రెండు దృష్టాంతా లివిగో.

1954 లో డిసెంబరులో పారిస్‌నందు ఉత్తర అట్లాంటిక్ సంధివ్యవస్థకు (NATO) సంబంధించిన మంత్రుల సభలో ఒక నిర్ణయం చేశాం. నిర్ణయానికి సంబంధించిన ఒక విషయం ప్రాముఖ్యమైంది. దానివలన ఉత్తర అట్లాంటిక్ సంధి వ్యవస్థకు సంబంధించిన రక్షణవ్యూహాల ప్రయోజనాలకు సహాయభూతంగా యుద్ధనైపుణ్యానికై అణ్వస్త్రాలను అభివృద్ధిపరచే పథకాలు వేయడానికి సాధ్యమైంది. అదే సంవత్సరం ఒక విధమైన వ్యూహానికి కూడా అంగీకారం జరిగింది. పశ్చిమ యూరపులో దురాక్రమణ సంభవిస్తే ఉత్తర అట్లాంటిక్ సంధి వ్యవస్థలోగల యూరప్ సభ్యుల సంరక్షణార్థం యూరప్ దేశపు మిత్రబలాల ఉన్నత ప్రధానకార్యాలయం (SHAPE) ఎక్కువ పనిచేయడానికి వీలైంది. దీనివలన ఉత్తర అట్లాంటిక్ సంధి వ్యవస్థ రష్యన్ శత్రువులమీద అణ్వస్త్ర ప్రయోగాలు చేయ

జంలో నిమగ్నులు కాకుండా వారిని రక్షించుకోడానికి బాగుగా వీలు ఏర్పడింది.

ఇదేవిధంగా కొరియాలోజరిగిన దురాక్రమణ స్వేచ్ఛా దేశాల కార్యాచరణవల్ల అదుపులో పెట్టడానికి వీలైంది. దానివలన ఉత్తరకొరియాను చైనాప్రజలను నాశనం చెయ్యడమే ఉద్దేశంగా పెట్టుకోకుండా యుద్ధాన్ని మితిమీరకుండా చేయడం, ముట్టడిని అరికట్టడం ఆపైన సంప్రదింపులు శాంతి స్థాపనకు మార్గదర్శకాలైనాయి. అయితే ఈ విధమైన అసమగ్రపరిస్థితుల్లో పరిమితాలైన విధానాలవలన పాశ్చాత్యులఅభిప్రాయాలకు భిన్నంగా చాలా అసంతృప్తి, నిస్పృహ కలిగించాయి. ఇలాగ జరగడానికి అసలుకారణం నా ఉద్దేశంలో ఈ సమస్యలను పరిష్కరించడంలో గల లోపంకాదు. ప్రజాభిప్రాయంలోనే సరియైన ఆలోచనాశక్తిలేక అసలు విషయాలనుగూర్చిన అజ్ఞానంవలన ఈ విధమైన నిస్పృహ కలిగిందని నా ఉద్దేశం.

మన అనుభవంవల్ల ఇంకొకవిషయం తెలుసుకొన్నాం. అది యుద్ధవ్యూహం ఎప్పుడూ రాజకీయవిధానానికి బానిసయై ఉండాలనడం. ఆ విధంగా కాకుండ అది ఎప్పుడైతే ప్రభువౌతుందో గతించిన రెండు ప్రపంచ సంగ్రామాలలోవలె విజయం అన్నది కష్టసాధ్యం అవుతుంది. అంతేకాదు. అది నూతన సమస్యలకు కూడా దింపుతుంది.

క్లాస్ విట్జ ప్రవచనానుసారం "యుద్ధం అంటే తదితర సాధనాలద్వారా సాగించేవిధానమే." దీనిని అందరూ ఏవిధంగా అర్థంచేసుకున్నారంటే బలప్రయోగం సమర్థనీయమని దాని

అంతరార్ధం విదేశాంగవిధానానికి సహాయసాధనగా సైనికబలం ఉండవలెనన్నది నా ఉద్దేశం. ఎప్పుడైనా ఉత్కృష్టమైన వ్యూహం సైనికబలానికి సంబంధించినది కాదు. సైనికవ్యూహాలకు మించి తీసుకొన్న సముచిత నిర్ణయాలుకాని, సలహాలు కాని, సైన్యాధికారులు ఎప్పుడైనా తీసుకొన్నారా అని నా సంశయం.

ప్రజాస్వామ్యంలో ఎన్నుకొనబడిన నాయకులకు సలహాదారులుగా ఉండవలసినవారు సైనికంగా, రాజకీయంగా ఉన్నతపరిస్థితులనుగూర్చి ఎప్పుడూ సలహా ఇవ్వవలసిఉంటుంది. అంతిమ నిర్ణయాలెప్పుడూ ఈనాయకులే చేయవలసిఉంటుంది. విదేశాంగ విధానానికి వ్యూహం అన్నది ఊతగా ఉండాలి అంటే యుద్ధపరిస్థితుల్లో ఇచ్చు సలహాలు సైనిక రాజకీయ పరిస్థితులనుబట్టి ఇవ్వవలసి ఉంటుంది. అదేవిధంగా శాంతి సాధనలో సైనిక మానసిక, ఆర్థిక రాజకీయపరిస్థితులుకూడా అవగాహన చేసికొనవలసి ఉంటుంది.

అనగా రాజకీయ నిపుణులు ముఖ్యమైన విధానాలకు పథకాలు వేయడానికి సైన్యానికి సంబంధించిన విషయాలను బాగా అవగాహన చేసుకోవలసి ఉంటుంది. అదేరీతిగా సైనికోద్యోగులు వారి వృత్తి శిక్షణయందే రాజకీయవిషయాలను గూర్చి బాగా అర్థం చేసుకోవాలి.

ఈ అవసరాన్ని గుర్తించి ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం మేము కెనడాలో జాతీయరక్షణ కళాశాల అన్నది స్థాపించాం. దీనియందు కలనల్ బ్రిగేడియర్ ఆ స్థాయిలో ఉన్న సైనికోద్యోగులను తీసుకొంటాం. ఆ విధంగా ప్రజాపరి

పాలనకు సంబంధించిన ఉద్యోగులను తీసుకొంటాం. వీరందరూ ఒక సంవత్సరంపాటు దీర్ఘకాలిక సమస్యలనుగూర్చి బాగా అభ్యసిస్తారు. ఇదేవిధంగా సంయుక్తరాష్ట్రాలలో జాతీయ యుద్ధకళాశాల ఒకటి నెలకొల్పారు. లండన్‌లోగల సామ్రాజ్య రక్షణకళాశాల ఒకతరంనుండి ఈ పద్ధతిలోనే పనిచేస్తోంది. 1951 లో పారిస్‌నందు ఉత్తర అట్లాంటిక్ సంధివ్యవస్థకు సంబంధించిన రక్షణకళాశాల నొకటి స్థాపించారు. దీనిలో ఇదే విధంగా అంతర్జాతీయస్థాయిలో శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ శిక్షణలన్నీ కూడా సక్రమమైన మార్గంలో ముందంజలు.

ఇదేవిధంగా యుద్ధాలలో పాల్గొంటున్న సైన్యబలాలకు సైన్యాధిపతులకు అవసరమైన నిబంధనలు పంపేవిషయంలో కూడా అభివృద్ధిజరిగింది. దీనివలన రాజకీయ విదేశాంగ పద్ధతుల్లోను, సైనికంగాను, రాజకీయంగాను ఒక సమన్వయం కుదరడానికి అవసరం ఏర్పడింది.

ఈలాటి సమన్వయం గడచిన రెండు ప్రపంచ యుద్ధాలలోనూ ప్రజాస్వామ్య ప్రభుత్వాలలోనూ శూన్యమైపోయింది. ఒకసారి యుద్ధం ప్రారంభమైన తర్వాత విదేశాంగ నీతి అన్నది అడుగంటింది. సైనికవిధానమే ప్రాముఖ్యంలోనికి వచ్చి "సంపూర్ణవిజయమో" లేక "బేషరతు ఓటమో" అన్న భావం బాగా అల్లుకుపోయింది.

ఇదేవిధంగా జాతీయస్థాయిలోగాని, అంతర్జాతీయ స్థాయిలోగాని శిఖరాగ్రసమావేశాలలోకూడ సైన్యాధికారులే ప్రముఖపాత్రలు వహించారు.

విదేశాంగవిధానంలో సలహాలిచ్చే రాజకీయనిపుణులు సైనిక వ్యూహ నిర్ణయాలలో పాల్గొనకుండా ఉండడంవల్ల యుద్ధానంతరసమస్యలు మరింత శోచనీయంగా కష్టతరంగా పరిణమించాయి.

అయితే ఈరోజున పెక్కు ప్రజాస్వామ్యదేశాలలో జాతీయంగాకాని సమాజనిర్మాణాన్ని గురించిన చైతన్యం బాగా వృద్ధి పొందింది. అయితే అన్ని సమాజ నిర్మాణసమస్యల పరిష్కారం జరిగిందని దీనిఅర్థంకాదు. కార్యాచరణకన్న సిద్ధాంతా లెప్పుడు ముందంజలో ఉంటే సరియైనపద్ధతుల్లో అభివృద్ధికి దోహద మేర్పడుతుంది.

# 3

## కూటములు :

# విధానంలో నూతన పరిమాణాలు

ఈ ఉపన్యాసాల ప్రారంభంలోనే నేనొక విషయం సూచించాను. మన తరంవారికి విపరీతంగా కనిపించే ఈ అంతర్జాతీయ సమస్యల సారాంశం వాటి క్రొత్తదనం కాదు. వాటిలో గల నూతన పరిమాణమే దీనికి కారణం. యుగ యుగాలుగా వస్తున్న మానవుని రాజకీయ జీవితంలోని సమస్యలే ఇవి.

ఈ పరిమాణంలో గల మార్పును దానికీ సాయుధ బలాలకీ రాజకీయ విధానాలకీ గల సంబంధాన్ని గూర్చి పరిశీలించడానికి ప్రయత్నించాను.

ఇక ప్రస్తుతం రాజకీయ సంఘాలగురించి పర్యవేక్షణ చేస్తాను. ఎందుచేతనంటే విదేశాంగ రాజకీయ విధానాల నిర్ణయం, వాటిని అమలపరచడం ఈ రాజకీయ సంఘాలపైన ఆధారపడి వుంటుంది. ఈ విషయంలో కూడా పరిమాణంలో చాలా మార్పులు వచ్చాయి.

ఈ యుగంలో విదేశాంగ నీతి లేదా విదేశాంగ వ్యూహపద్ధతులు ఒక దేశానికి సంబంధించినవి మాత్రమే కాక అటువంటి దేశాల కూటమికి సంబంధించినవిగా ఉన్నాయి.

దీనివలన ఈ కూటమి విధానంలో గల సహకారం ఐక్యతకు సంబంధించిన సమస్యల పరిష్కారానికి ఆవశ్యకం ఏర్పడింది.

ఈ కూటమి వ్యవహారాలను జయప్రదంగా నిర్వహించడం ఎప్పుడూ కష్టమే. యుద్ధం జరుగుతున్నప్పుడు ఇది కష్టతరం అవుతుంది. శాంతియుత కాలంలో దీని అవసరం అంతగా ఉండదు. అయితే ప్రస్తుతం మనంవున్న పరిస్థితిలో అనగా యుద్ధశాంతి యేకైక కాలంలో ఉన్నప్పుడు ఇది మరింత కష్టతరంగా, నిరాశాజనకంగా ఉంటుంది.

అంతర్జాతీయ విషయాలలో నైతేనేమి, తదితర విషయాలలో నైతేనేమి గమ్యాలకు, మార్గాలకు గల తారతమ్యంలో పొరపాటు పడకూడదు. ఇటువంటి పొరపాటు స్వేచ్ఛాప్రజలకు మిత్రత్వంమీద గల ఉద్దేశాలలో సులువు యేర్పడుతుంది.

ఈ కూటములు – సమిష్టి కార్యకలాపాలు మన భద్రతను పెంపొందించుకోనడానికే నిర్మింపబడ్డాయి. స్వేచ్ఛా సంఘం కలయికకు, నిజాయితీకి ఇవి చిహ్నాలు. ఈ కలయికను, ఈ నిజాయితీని ఛిన్నాభిన్నం చేయడానికే ఈ నియతృత్వాల బెదరింపు. ఈ సంఘాన్ని రక్షించుకోనడానికిఐకమత్యం, శక్తిసామర్థ్యాలు కలిగి ఉండడమే కాదు. అవే ప్రాముఖ్యంగా ఉండాలి.

ఇదే ముఖ్య కారణంగా తీసుకుని దేశ రక్షణ విషయంలో ఖర్చు ఎక్కువైనా సైనిక వ్యూహాపద్ధతుల్లో పేరే మార్పులు వచ్చినా అమెరికా మనలను వదలి ఒంటరిగానే విహరిస్తుందనే భయం మన కందరికీ వుంది.

ఈ విధమైన ఒకే ఖండానికి సంబంధించిన రాజకీయ విధానం చాలా సంకుచిత దృష్టిగా కనిపిస్తోంది. దాని అర్థం మిగతా మిత్రరాజ్యాలు, స్వేచ్ఛారాజ్యాలు మన విధివశంలో లేవని వదలి వేయడమే అవుతుంది. అంతేకాదు. మన దేశాల సైనిక వ్యూహాలకు భద్రతలకు సంబంధించి నంతవఱకు మాత్రమే లండన్‌లోగాని పారిస్‌లోగాని బాన్‌లోగాని కొన్ బెర్రాలోగాని గల ప్రజల స్వాతంత్ర్యాన్ని గూర్చి వాషింగ్టన్‌లోను ఒట్టావాలోనూ గల ప్రజలు ఆలోచిస్తున్నారని తప్పుడు అభిప్రాయం ఏర్పడుతుంది.

సాయుధ బలాలు, తదితర వ్యూహాలకు సంబంధించిన విషయాలు వీటిని గూర్చి మనం మర్చిపోకూడ దన్నమాట నిజమే. అయితే వీటికన్నా అమెరికా ఆధీనంలో వున్న అణ్వస్త్ర బలాల శక్తికన్న అత్యధికంగా మనం ప్రాముఖ్యం ఇవ్వవలసిన విషయం స్వేచ్ఛాదేశాల మిత్రత్వం. అదే శాంతి స్థాపనకు గట్టి పునాది.

సోవియట్ పరిపాలకులు మనకు బాగా శక్తి సామర్థ్యాలుగల విషయాలలో అంటే అణ్వస్త్ర ప్రయోగాలలో ప్రజాస్వామ్యాలకు ద్రోహం తలపెడతారని నేను అనుకోను. దాని వలన వారికీ వారి సామ్రాజ్యానికే ముప్పు. అలాగ కాక మనలో వున్నలోపాలు – అనగా వారి పరిభాషలో పరస్పర విరుద్ధాలు గోరంతలు కొండతలుగాచేసి మనలను ఎదుర్కోవడమే కమ్యూనిష్టుల రాజకీయ వ్యూహం అని తెలపడానికి మనకు తగినన్ని నిదర్శనాలు వున్నాయి. ఈ గమ్యస్థానం చేరడానికి వారు మన ఐకమత్యాన్ని భేదించి మన

కూటమిని నిర్మూలనం చేయదలచుకున్నారు. అంతేకాదు సంయుక్త రాష్ట్రాలను వారి మిత్రులనుండి వేరు చేయడమే కమ్యూనిష్టుల ప్రధాన సూత్రం.

కాబట్టి ఈ ప్రస్తుత పరిస్థితుల్లో స్వాతంత్ర్యాన్ని సంరక్షించడంలోను, శాంతిని కాపాడడంలోను పాల్గొంటున్న దేశాలల్లో అత్యధికమైన ఐకమత్యాన్ని పెంపొందించడం అత్యవసరం

ఈ ఐకమత్యం వున్నదేకదా అని మనం ఉదాసీనంతో వుండకూడదు. మన కూటమిలో గల సభ్యులందరు ప్రజాస్వామిక ప్రతినిధులు. ఈ ప్రజాస్వామ్యంలో తరతరాలనుండి వస్తున్న స్వయం పరిపాలన స్వేచ్ఛ మొదలగు ఆదర్శాలు కొన్ని వున్నాయి. వీటివలన మన శక్తిసామర్థ్యాలు పెంపొందుతాయా క్షీణిస్తాయా అన్న విషయం చాలవఱకు మన ప్రజలు ఎంతవఱకూ పరస్పరం సహాయం చేసుకో గలరో దానిమీద ఆధారపడి వుంటుంది. అంతేకాదు ఈ కూటామికి కావలసిన అవసరాలు దేశాలకు సంబంధించిన స్వల్ప విషయాలు ఎంతవఱకూ త్యాగం చెయ్యగలవో దానిమీద కూడా ఆధారపడి వుంటుంది.

స్వేచ్ఛాకూటమిలో సభ్యులకుగల సంబంధ బాంధవ్యాలు, స్వేచ్ఛా ప్రజాస్వామిక సంఘంలో పౌరులకుగల సంబంధ బాంధవ్యాలు, ఒకటి నింకొకటి పోలివున్నాయి. కొన్ని విధానాలలో అధిక సంఖ్యాకుల అధికబలం వల్ల అల్ప సంఖ్యాకులను త్రోసివేయ వచ్చు. ఈ విధానాలు నెగ్గినప్పటికీ అతికష్టంమీద అమలు పరచవలసి వుంటుంది. ఈ విధా

నాలు అధిక సంఖ్యాకులు అమలు జరపడం వలన సంఘుం యావదైక్యతకు భగం వాటిల్లుతుంది. ప్రజాస్వామ్యానికే ముప్పువస్తుంది. మన రెండు రాజ్యాలలోగల అనుభవాలే దీనికి నిదర్శనం.

కాబట్టి ఇంతవఱకూ ముఖ్యమైన విషయమేమంటే, ప్రజాస్వామ్య పరిపాలన విధానంలోవలె ఈ కూటమి వ్యవహారాలలో కూడా సమిష్టిచర్య అనేది చర్చలవలన సమ్మతివలన కొనసాగాలి. వివిధ దేశాల కూటమిలో ఈ సమ్మతి జరగడం చాలా కష్టమూ అవసరమైంది కూడా.

సంయుక్త రాష్ట్రాలు రకరకాల ప్రాంతాల కూటమి. కెనడా కూడా ఇంతే. ఈ కెనడా రెండు ప్రత్యేక జాతులకు సంబంధించిన ప్రజల కూటమి. ఆ రెండు జాతుల భాషలు వేరు. మతం వేరు. సంస్కృతి వేరు. అందువల్ల రాజకీయ కళానైపుణ్యం చూపించి ఈ రకరకాల జాతికి చెందిన ఒక మానవ సంఘుం స్థాపించడానికి చాలా శ్రద్ధతీసుకోవలసి వస్తోంది.

ఈ విధంగా అమెరికన్ల కెనడియన్ల జాతీయస్థాయిలో ఒక రాజకీయ ఐకమత్యం సాధించారు. అది ఏ విధంగా జరిగిందీ జ్ఞప్తికి తెచ్చుకోవడం మంచిది.

సమిష్టి రాష్ట్రకూటమి తదనంతరం కెనడా దేశంలో రాజకీయ నిపుణతయందు ఒక ముఖ్యమైన సూత్రాన్ని ఆదర్శంగా పెట్టుకున్నారు. అదేమంటే ముఖ్యమైన విషయాలలో జాతీయ నాయకులందరూ దేశంలోగల రెండు ముఖ్యభాగాలకు సంబంధించిన అధిక సంఖ్యావర్గంవారికి ఒప్పందమైన విధా

నాన్ని అవలంభిస్తూ వచ్చారు. ఇది ఒకప్పుడు మాత్రమే సాధ్యమౌతుంది. ఒక విధంగా నిగ్రహశక్తి బాధ్యత బుద్ధివికాసం నీతి నియమాలు ఉండాలి. అంతేకాదు. ఇతరుల ఉద్దేశాలు గ్రహించడంకూడా రెండవవారు తెలుసుకొని వారితో అభిప్రాయ భేదాలు వచ్చినా అవతల వారిని గౌరవంగా చూడ గలిగి ఉండాలి. కెనడాలో ఐకమత్యం స్థాపించబడిందంటే దానికి చాలవఱకు కారణం చిక్కు సమస్యలలో నైతేనేమి ఆపదలలో నైతేనేమి ప్రజాబాహుళ్యం ఈ పై చెప్పబడిన స్వయం నిగ్రహశక్తికి సంబంధించిన గుణగణాలను బాగా అభివృద్ధిలోనికి తెచ్చుకొన్నారు. ఇదే విధంగా ఈ రోజునకూడా విదేశ విషయాలలో జాతీయ సంరక్షణలో ఈ విధానమే ఉన్నదంటే దానికి కారణం మన మింతవరకూ సాధించిన ఐకమత్యమే.

సంయుక్త రాష్ట్రాలలోకూడా పరిస్థితి ఇదేవిధంగా ఉంది. స్వాధీనం చేసుకోవడం కూడా జరిగింది. అందుచేత మన రెండు దేశాలలో గల జాతీయ నాయకులయందు ఇంగితజ్ఞానం ఉండాలి. వివిధ తరగతులకు చెందిన ప్రజాబాహుళ్యంలో అందరకు సంబంధించిన వ్యవహారాలలో అంగీకారాన్ని సంపాదించాలి. రాజకీయ నాయకులు దీనికి అనుగుణంగా ఉన్నత ప్రయత్నాలు చెయ్యాలి. స్వయం నిగ్రహశక్తి బాగా చూపించాలి. అన్ని తరగతులకు చెందిన ప్రజాబాహుళ్యపు మద్దతుకోసం ప్రయత్నించాలి. ఇది అసాధ్యమైతే కనీసం ఆ తరగతికి చెందిన ప్రజల అంగీకార సూచనకైనా ప్రయత్నించాలి. బాగా అభివృద్ధిచెందిన ప్రజాస్వామ్యంలో

జయ ప్రదమైన నాయకత్వం చెలాయించడమంటే తలలు లెక్క పెట్టడం కాదు.

ప్రజాస్వామ్యంలో గల విజేతలైన రాజకీయవేత్తలు వారి పక్షానికి సంబంధించినంతమట్టుకు కాని వారి దేశానికి సంబంధించినంతవరకు కాని అనైక్యతాసూచనలు ఏమాత్రం కనిపించినా వాటిని గ్రహించగలిగి ఉండాలి. అంతేకాదు. ఆ సూచనలను మాపుటకుకూడా ప్రయత్నిస్తారు. వారు చెప్ప బోయే మాటలభావం ప్రజాబాహుళ్యంమీద ఏ విధంగా పరిణమిస్తుందో కూడా తెలుసుకోవాలి.

సంకుచితదృష్టిగల రాజకీయవేత్తకు ఈ ప్రజలు అతని జిల్లాకు లేక అతని రాష్ట్రానికి సంబంధించిన ఓటర్లుఅయి ఉండ వచ్చు. విశాలదృష్టిగల రాజకీయవేత్తఅనగా దేశీయస్థాయిలో ఉన్న రాజకీయవేత్త మాట్లాడబోయేముందు ప్రతిమాటను తూచి వేస్తాడు. లెజస్లేచరులో తయారుచేసుకున్న ఉపన్యా సంలో కాని పత్రికావిలేఖరులగోష్ఠిలో కాని ఈ విధమైన పద్ధ తినే అవలంబిస్తాడు. ఈవిధంగా లేకపోతే దేశీయస్థాయిలో రాజకీయవేత్తగా ఎక్కువకాలం ఉండలేడు.

అయితే ఈరోజున జాతీయస్థాయిలో గల రాజకీయ వేత్తలు చాలరు. అంతేకాదు. జాతీయదృక్పథంతో చూచే వ్యక్తులు వారి మాటలవల్ల వారి ప్రవర్తనవల్ల వారి దేశానికే ముప్పుకూడా తీసుకురావచ్చు.

అందుచేత మన స్వేచ్ఛాసమితిలో ఎదుర్కొనవలసిన ప్రధానసమస్య ఏమంటే ఈ రాజకీయ నిపుణత అనే కళను

అంతర్జాతీయస్థాయిలో ఆచరణలో పెట్టడమే. ఇది చిన్న సమస్య కాదు. అయినా దానిని ఎదుర్కోవాలి.

నియంతృత్వ దేశాలలో గల పరస్పర రాష్ట్రకూటాలకు స్వతంత్ర ప్రజాస్వామ్యంలో గల పరస్పర రాష్ట్రకూటాలకు చాల వ్యత్యాసముంది. ప్రజాస్వామ్య ప్రపంచంలో మిత్ర రాజ్యాలు దాస్యరాజ్యాలు పరస్పరవిరుద్ధాలు.

మన సమిష్టివ్యవహారాలు బాగా జరగాలంటే మన రాజ్యదృక్పథంలోనే కాకుండా ఇంకా విశాలమైన దృక్పథంలో మెలగడం అలవాటు చేసుకోవాలి.

ఈ విషయాలు రాజకీయవేత్తలు రాజకీయనిపుణులు సైనికోద్యోగులు బాగా అర్థం చేసుకోవాలి. అంతేకాదు. ఇవి పౌరులందరకూ సంబంధించినవికూడా. అందులో ప్రత్యేకంగా ప్రజానాయకులు వారు మాట్లాడే ప్రసంగాలు చాలా జాగ్రత్తగా చేయాలి.

ఒకప్పుడు మామూలుగా ప్రజానాయకులకు జరిగే పద్ధతిలో నాకొక అనుభవం జరిగింది. ఒక ఉపన్యాసంలో నేను చికాగోలో కాపురం చేశానని ఆర్మర్ కంపెనీలో పనిచేశానని చెప్పాను. దానిని వెంటనే అందుకొని కమ్యూనిస్టు రేడియో నేను యుద్ధప్రచారకుల్లో ఒకణ్ణని యుద్ధపరికరాలు తదితర సాధనాలు తయారుచెయ్యడంలో నాకు ఆసక్తి ఉన్నదని ప్రచారం చేసింది.

అయితే ఈ విధమైన ఐకమత్యం సాధించాలంటే పెద్ద రాజ్యాలవాళ్ళకు ఇది చాలా కష్టం. పెద్ద రాజ్యాలవాళ్ళు ఎప్పుడూ తమ శక్తి సామర్థ్యాలవల్ల ఒక విధమైన ఆత్మవికా

షాన్ని అలవరచుకొని మిగిలినవారంతరు దానిప్రకారం నడుచు కొంటారని భావిస్తారు.

సర్వాంగీకృతమైన అధికారం, బాధ్యతాయుతమైన ఆధిపత్యం ప్రజాసామ్యం చరిత్ర ఈ పై చెప్పబడిన గమ్యస్థానానికి చేరడానికి చేసిన ప్రయత్నంయొక్క కథయే. ప్రజాస్వామ్యంలోని ప్రజానాయకులు తమకే కాక ఇతరులకుకూడా బాధ్యతలు హక్కులు ఉన్నాయని గుర్తించినంతవఱకు ప్రజాస్వామ్యం అన్నది ఉత్త నోటి మాటయేకాని గొప్ప కార్య సాధన కానేరదు. ఇదే సూత్రం దేశాలమధ్యగల సంబంధాన్ని నిరూపిస్తుంది.

తక్కువ శక్తిగల రాజ్యాలు ఎక్కువశక్తిగల రాజ్యాలు విధానాలని ప్రవర్తనలని చాలా మెళుకువతో కనిపెట్టిఉండాలి. అంతేకాదు. అనైక్యతవల్ల వచ్చే ఆపదలను కూడా గుర్తించ గలిగిఉండాలి.

అయితే తక్కువ శక్తిసామర్థ్యాలుగల రాజ్యాల నాయకత్వంలోగల కార్యభారాలు అవగాహన చేసుకోవాలి. తన కన్నా యెక్కువబలవంతులైన వారితో మిత్రత్వాన్నికూర్చి జాగ్రత్తగా ఉండడం సహజమే. కాని అర్థంలేని భయాలు పెట్టుకోవడం పనికిరాదు. చిన్న రాజ్యాలవారి విమర్శలు ప్రజ్ఞావంతంగాను నిర్మాణాత్మకంగాను దోహదకారిగాను ఉండవచ్చు.

అసలు మన విమర్శ ఏ సందర్భాలలో ఆవశ్యకంగాను సహాయభూతంగాను ఉంటుందో మరి ఏ సందర్భాలలో అనైక్యతకూ బలహీనతకూ దోవ తీస్తుందో బాగా గుర్తించగలిగి

ఉండాలి. విషమ పరిస్థితుల్లో వెనుకనుండి సారథ్యం చెయ్యడం ఒక విధంగా తప్పుడు మార్గాలకు దారితీయడమేకాకుండా అపాయకరంకూడా. ముందుండి తప్పుడుసారథ్యం చెయ్యడం కూడా ఇంతే. ఈ సందర్భంలో నా కొక వ్యంగచిత్రం జ్ఞాపకం వస్తోంది. ఆ చిత్రం కింద ఈ క్రింది విధంగా వ్రాసివుంది. "మీ నాన్న గారు సందు గొందులు తిప్పేటప్పుడు ఆయన్ని అల్లరి పెట్టవద్దని ఎన్నిమార్లు చెప్పానురా పిల్లవెధవల్లారా?"

కూటమిలో తక్కువ రాజ్యాలకు ఒక విధి ఉంటుంది. అది వారి ప్రత్యేకతను స్వేచ్ఛా నిర్ణయాలను వదలుకోవడం కాదు. ఆ విధంగా చెయ్యడం కోరదగిందికాదు. అది అసాధ్యంకూడా. ఈ చిన్న రాజ్యాలవారికి కొంత విచక్షణాశక్తితో మెలగడం, కలుపుగోలుతనానికి అలవాటుపడడం ముఖ్యం.

ఈ పరిస్థితులలో గల పెద్ద రాజ్యాలవారికి ఒక ప్రత్యేకమైన విధ్యుక్తధర్మముంది. ఓర్పు నిగ్రహశక్తి సహనం ఇతరుల అభిప్రాయాలందు గౌరవభావం మొదలైన సుగుణాలు వారు అలవర్చుకోవడం విధాయకం.

అత్యంత ముఖ్యమైన ఈ సుగుణాలను అన్నింటినీ సమ్మేళనంచేసి కూటమిని జయప్రదంగా సాగించడం సులభం కాదు. దానికి తగిన సాధనసంపత్తియే కాకుండా అందరిని కూడగట్టుకొని సర్వసాధారణ విధానాలని ఏర్పరచడానికి ఇచ్ఛాశక్తి కూడా కలిగిఉండాలి. ఇది ప్రజాస్వామ్యరాజాలలో గల రాజకీయనాయకులకు చాలా సులభం.

ఒక దేశానికి సంబంధించిన మహాత్కార్యాన్ని నిర్వహించడంలో అందరితోను సమయానుకూలంగా సంప్రదించడం

ప్రజాస్వామ్యంలో మామూలుగా జరిగేపద్ధతి. ప్రజాస్వామ్య పద్ధతుల్లో ఏమాత్రం అనుభవం ఉన్నవాడైనా ఒకవిషయాన్ని వెంటనే గ్రహిస్తాడు. అదేమంటే ఏ నూతనిసమస్యనైనా ఒక నిర్ణయానికి రావడానికి ముందు సభలలోనైతేనేమి మంత్రివర్గ సమాలోచనలలో నైతేనేమి వ్యాపార సమాఖ్యసంఘాలలో నైతేనేమి డైరెక్టర్లసమావేశాలలో నైతేనేమి తమకు సంబంధించిన మిత్రులతో వ్యక్తిగతమైనచర్చలుసాగించడం అత్యంత అవసరం.

కొన్ని రాజ్యాలకూటమిలో ఈ విధానాలు సమాన ప్రాధాన్యాన్ని నిరూపిస్తాయి. అయితే ఈ విధానాలు అన్ని వేళల అమలుజరపవు. కాని నా ఉద్దేశంలో ఈ రోజు ఆ గమ్యస్థానం చేరడానికి కొంత అభివృద్ధి జరుగుతూనే ఉంది.

అయితే ఈ రోజున సహకారమార్గాలను అభివృద్ధి చేస్తున్నాం. ఒకరిఅభిప్రాయం ఒకరు అర్థంచేసుకోవడం జరుగుతోంది. సమిష్టిచర్యకు ముందు సంప్రదింపులు జరగడంలో గల విలువను కూడా గ్రహిస్తున్నాం. సంప్రదింపులు అంటే ఇదివరలో తీసుకొన్న నిర్ణయాలను ఆచరణలోపెట్టడానికి బాధ్యత వహించడమే కాదు.

సంప్రదింపులంటే అభిప్రాయాలను ఇచ్చిపుచ్చుకోవడం మంచిచెడ్డలను ఆలోచించడం ఆ తదుపరి అందరికీ బాగానచ్చిన ఒకవిధానాన్ని ఏర్పరచుకొనడం అని అర్థం. అనగా పరస్పర విరుద్ధాలైన స్వార్థాలకు అనుగుణంగా నడవడం.

ఇది రాష్ట్రవర్గాలలో ఒక దుస్సాధ్యమైన ఆజ్ఞగా పరిగణింపబడవచ్చు. ఇది నిజంగా దుస్సాధ్యమైన ఆజ్ఞయే. దానిని

సాధించడానికి కొంతకాలంపడుతుంది. విషమపరిస్థితిలోగాని యుద్ధసమయంలోగాని ఇది లేకుండా జరిగిపోవచ్చు. కాని పర్యవసాన మేమంటే సంపూర్ణమైన సంప్రదింపుల ఆవశ్యకతకు సమ్మతికావాలి. దానివలన స్వేచ్ఛాప్రజల సమిష్టివ్యవహారాలు చక్కబడతాయి. అంతేకాదు; ఈ అంతర్జాతీయ విషాదపరిస్థితుల్లో మనం చాలాకాలం మెలగవలసిఉంది. అటువంటి సమయంలో ఈ వివిధతరగతులకు చెందిన ప్రజాసామ్యాలలో దృఢమైన ఐక్యతకు ఇది దోహదకారి.

విస్తృత బాధ్యత అంటే ప్రజాస్వామ్య ప్రభుత్వాలు తమదేశాలపట్ల ఉండే బాధ్యతలను వదులుకోమనిగాని, సడలించమనికాదు. ఆ బాధ్యతలకు ఇది ఒక అనుబంధం. అతి ముఖ్యవిషయమేమంటే ప్రజాభిప్రాయాలకు పునాదులువేసే రాజకీయవేత్తలు, పత్రికాధిపతులు, ఉపాధ్యాయులు, వ్యాపారస్థులప్రవర్తన వారి దృక్పథంగూర్చి మనం ఆలోచించాలేగాని ప్రజాప్రభుత్వంమధ్య జరిగిన సంధులు ఒడంబడికలు అంత ముఖ్యమైనవి కావు.

ఈ విధమైన సంప్రదింపులు జరగడంకోసం ప్రతిప్రభుత్వం మిగత రాజధానులలో నియమించిన రాజకీయ కార్యాలయాలే కాకుండా కొన్ని ప్రత్యేక సంస్థలున్నాయి. ఉదాహరణకి ఉత్తరఅట్లాంటిక్ సభ. ఈ సభలోఉన్న శాశ్వత ప్రతినిధులు చేస్తున్నకృషి ఉత్సాహపూరితంగాను చాలా విలువైనదిగాను ఉంది. దానినే విస్తృతంచేసి అభివృద్ధిపరచాలి. అయితే. ఉత్తరఅట్లాంటిక్ సంధి వ్యవస్థకు సంబంధించిన విదేశాంగ మంత్రుల సమావేశాలు అప్పుడప్పుడు జరిగే రక్షణ

ఆర్థికశాఖామంత్రుల సమాలోచనలు కష్టతరమైనసమస్యలు తెచ్చిపెడుతున్నాయి. ఇటువంటి సమావేశాలు సాధారణంగా ఒకటి రెండు రోజులలోనే జరిగిపోవడం, ఆ జరిగినప్పుడు తయారుచేసుకొన్న ఉపన్యాసాలకు సంయుక్త ప్రకటనల గూర్చిన ఆలోచనలకు ఎక్కువకాలం వృథా అయిపోతుంది. మంత్రులసభల్లో పాల్గొనేవారు పత్రికావిలేఖరులవలె కాలానికి బానిసలైనారు. నిర్ణయాలకు అనుగుణంగా భాషాపరిజ్ఞానావశ్యకత వారికి ప్రధానమైన విషయంగా లేదు. ఎంతసేపూ సభ ముగిసినవెంటనే ఏరెండుగంటల్లోనో విమానాశ్రయాలకు వెళ్ళి కొన్ని వేల మైళ్ళదూరంలో ఉన్న వారి స్వగృహాలకు చేరి వారివారి కార్యక్రమాలకు హాజరవడం ప్రధానమైపోయింది. దీనివలన కొన్ని అనర్థాలు వాటిల్లాయి. కొన్ని సంవత్సరాలుగా ఇటువంటివి చాలా జరిగాయి. కాని వివిధపక్షాలవారు సంప్రదింపులలో పాల్గొని విషయాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకొనివచ్చిన నిర్ణయాలను ప్రమాణపత్రాలలో పదిలపరచినట్లయితే అనర్థాలు రావు.

సంప్రదింపులంటే గమ్యస్థానాన్ని చేరడానికి ఒక సాధనమే. ఆ గమ్యస్థానం ఏమిటి?

ఈ రోజున గమ్యస్థానం అంటే అర్థం మన ఉనికిని మన నాగరికతను భద్రపరచుకొనడమే. ఇది చాలావఱకు ప్రజలలోని శ్రద్ధాభక్తులపైన సమిష్టికి చెందినామనే ఒక విధమైన అభిప్రాయంపైన ఆధారపడి వుంటుంది. శత్రురాజ్యాలకు సులభసాధ్యమైన దేశాలలోగల ప్రభుత్వాధికారులలో ఈ శ్రద్ధాభక్తులు ఈ అభిప్రాయాలు అత్యంత ఆవశ్యకం.

1930, 1940 ప్రాంతాలలో జరిగిన స్వేచ్ఛా ప్రభుత్వాలకు సంబంధించిన నిర్ణయాలు ఈ ప్రభుత్వాలు కాని దేశాలు కాని ఎప్పుడూ చేయవని ఆశిద్దాం. సంపూర్ణంగా లొంగి పోవడం లేదా ధైర్యంతో ఎదుర్కోడం అనేది వారి కష్టాకు గడ్డు సమస్య అయింది. ఈ విధమైన గడ్డు సమస్యలు ముందు మన కెన్నడూ రావని ఆశించినా ఒక విషయం మాత్రం గుర్తుంచుకోవాలి. ఆ సమస్యలను త్రోసిపుచ్చాలన్నా లేక ఎదుర్కోవాలన్నా వ్యక్తిగత రాజ్యాల శక్తి సంపత్తి మీద దృఢ విశ్వాసాల మీద ఆధారపడి వుంటుంది.

ఆ విధమైన విశ్వాసాలు రావాలంటే సైనికపటిష్ఠంబడి కలతో బాటు తదితర విషయాలలో కూడా పురోగమనం వుండాలి. ఈరోజున ఉత్తర అట్లాంటిక్ సంధి వ్యవస్థలో అందరికీ సర్వ సామాన్యమైన ఒక సైనిక విధానం వుంది. రక్షణశాఖకు సంబంధించిన పరస్పర సహకారానికి కొన్ని ఏర్పాట్లున్నాయి. అయితే ఈ సైనిక విధానాలతో బాటు విదేశాంగ విధానాల్లో కూడా ఈపరస్పర సహకారం అత్యంత అవసరం. అంతేకాదు. ఆర్థిక వ్యవహారాల్లోనూ, సాంఘిక వ్యవహారాల్లోను పరస్పర సహాయ భూతాలుగా ఉండే విధానాలు కూడా అత్యంత ఆవశ్యకాలు.

సమిష్టి దృఢంగాను శాశ్వతంగాను వుండాలంటే ఈ రకరకాలైన విధానాలు విచ్ఛిన్నంగా ఉండరాదు. సంయుక్త రాష్ట్రానికి కెనడాకి మధ్యగల సంబంధ బాంధవ్యాలు దీని కొక తార్కాణం. ఈ రాజ్యాలు సన్నిహితంగాను స్నేహితంగాను వున్నాయి. అయితే మన రాజ్యాల మధ్యగల వ్యాపా

ాలకు ఆర్థిక వ్యవహారాలకు వున్న సహకారంతో బాటు రెండు దేశాలకు మధ్యగల ఎల్లలో రక్షణకు సంబంధించిన విధానాలుకూడా ఆవశ్యకమని మనకు తెలుస్తున్నది. ఇదే విధంగా ఒక అస్త్రాలపైననే దృష్టి నిలపడంవలన మిగతా విషయాలలో అభివృద్ధి సన్నగిలుతోంది.

ప్రజాస్వామ్య విధానాన్ని నడపడం సులువుకాదు. దానిలో ఉండే బాధ్యతలు పౌరులకుగాని రాజకీయ వేత్తలకు గాని చాలా వున్నాయి. ఆ బాధ్యతలు అంతర్జాతీయ స్థాయిలో విస్తరించినపుడు తదనుగుణంగా మన కష్టాలుకూడా విపరీతం అవతాయి. అయితే ఈ మన కష్టసమయంలో ఈ బాధ్యతలకు అనుగుణంగా ప్రజాస్వామ్యం నడచుకోగలదా అన్నది అస్పష్టంగా వుంది. నా స్వానుభవంవల్ల ప్రజలలో గల శక్తి సామర్థ్యాలనుబట్టి ప్రజాస్వామ్య దేశాలలోగల నాయకులనుబట్టి నేనొక విషయం మాత్రం ఘంటాపథంగా చెప్పగలను. ఈ పరస్పర సహకారానికి కావలసిన నిగ్రహ శక్తి ఈ ప్రజాస్వామ్య విధానంలో వున్నదని నా విశ్వాసం.

# 4

## బహిరంగ లౌక్యం :
## ముఖాముఖి సంప్రదింపులు

'బహిరంగంగా చేసుకొన్న బహిరంగపు సంధి ఒడం బడికలు' అనే ఒక నినాదాన్ని అధ్యక్షుడు విల్సన్ ప్రథమ ప్రపంచ సంగ్రామపరిస్థితుల్లో లేవదీశాడు. రాజకీయ విధా నానికి సంబంధించిన విషయాలలో ప్రజలకు తెలియకుండా చేసుకొనే ఒడంబడికలు చాల చెడ్డవి; ఖండింపదగినవి.

విధానాల విషయంలో ప్రజాసమ్మతి అవసరం. ఆ విధా నాలు అందరికీ తెలిసిఉండాలి. అయితే ఆ విధానాలను ఆచ రణలో పెట్టడానికి కావలసిన సాంకేతికమైన ఏర్పాట్లలో రహస్య ప్రవర్తనకు అవకాశముంది. సంయుక్తరాష్ట్రాలు కెనడా దేశాలు చేస్తున్న రేడారు హెచ్చరిక సన్నాహాలు అభివృద్ధి కరంగా ఉన్నాయి. ఈ సహకారాన్ని గురించి దీనికిగాను అయిన ఖర్చునుగూర్చి అందరికీ తెలిసినదే. అయితే దీనికి సంబంధించిన సాంకేతికమైన ఏర్పాట్లు రేడారు నెలకొల్పిన ప్రదేశాలుమాత్రం ఎవరికీ తెలియవు.

అయితే అధ్యక్షుడు విల్సన్ నినాదానికి కొంతవరకు అర్థం ఉండకపోవచ్చు. హెరాల్డు నికల్సన్ అనే వ్యక్తి వ్రాసిన

పుస్తకంలో ఒక ఫ్రెంచి రాజకీయ కోవిదుడు యీ విధంగా అన్నట్లు చెప్పాడు. "ఏ రోజైతే రహస్యానికి తావుండకుండా పోతుందో ఆ రోజు ఏ విధమైన సంప్రదింపులు జరగడం అసంభవం. ఈ ఉద్ఘాటన కొంత విపరీతంగా కనబడవచ్చు. అయితే రాజకీయ చతురతలో నా అనుభవాన్ని పురస్కరించుకొని ఈ ఉద్ఘాటనలలో గల శక్తిని గుర్తిస్తున్నాను.

ప్రపంచస్వామ్య ప్రభుత్వాలలో వ్యక్తిగత రాజకీయ వేత్తలకు ఎన్నికలలో సరియైన గెలుపుకు గౌరవ ప్రతిష్ఠలు అత్యంత అవసరం. అయితే యెప్పుడో ఒకనాడు ప్రజాస్వామ్యం అన్నది అభివృద్ధి పొంది సహనం, విజ్ఞానం మున్నగు సద్గుణాలకు పుట్టినిల్లై ఒక్క సత్యానికి తలవొగ్గగలదని ఆశించవచ్చు. అయితే ఆరోజు ఇంకా రాలేదు.

ఒడంబడికలకు కావలసిన స్వేచ్ఛా పరిస్థితులు ఏర్పడాలంటే రాజకీయ రంగంలో గల ప్రతినిధులు కఠిన నిబంధనలు ఇచ్చిన ఎడల అది పెద్ద ముప్పుకే దారి తీయగలదు. ఎందువల్లనంటే ఆ సమావేశాలలో జరగబోయే ప్రతి విధానాన్ని గురించి ప్రపంచానికంతా వెల్లడి అయిన తర్వాత ఆ విధానంలో ఏ మార్పు వచ్చినా దైనిక పత్రికలలోను, రేడియో వార్తలలోనూ ఈ ప్రతినిధుల విధానాలను తీవ్రంగా విమర్శించడం అవుతుంది.

ఈ బహిరంగ రాజకీయ చతురతలో ఇంకొక చిక్కు ఉంది. సంప్రదింపులలోగల ప్రతి అంశాన్ని ప్రజా ఉద్రేకం ద్వారా అంతులేని చర్చలకు గురిచేయవచ్చును.

అసలు సంప్రదింపుల అంతరార్థం వివిధములైన స్వార్థాలను సమ్మేళన చేయడమే. అందరికీ నచ్చిన సర్వసామాన్య పద్ధతిని కనుగొనడానికి ప్రయత్నించడమే. అందరికీ అనుగుణంగా ఒడంబడికలు కూర్చుకొనడమే. అయితే ఎదుటివానికి మనం ఏమాత్రం లొంగినట్లు బహిరంగంగా ముందే వెల్లడి అయితే ఆ వార్త తక్షణమే పత్రికలద్వారా రేడియోద్వారా సర్వత్రా వ్యాపిస్తుంది.

ఇందువల్లనే ఇంతకుముందుశతాబ్దాలలో డి కాలియర్స్ అనే రాజనీతిజ్ఞుడు ఈ విషయంలో ఒక సలహాయిచ్చాడు.

"సంప్రదింపులలో గల రహస్యమేమంటే వివిధవర్గాలకు చెందిన స్వార్థాలను సమ్మేళనం చెయ్యడమే. ఆటంకాలనేవి సంప్రదింపులకు ఎప్పుడూ హానికరమే. అవమానానికి లోనైన మనుష్యులు సంప్రదింపులలో పాల్గొనడానికి యిష్టం లేకపోగా ఆ సంప్రదింపులు ఛిన్నాభిన్నం చెయ్యడానికికూడా వెనుదీయరు. బలప్రయోగంద్వారా కాని మోసంవల్ల కాని సాధించిన విజయానికి గట్టి పునాది ఉండదు. దీనినే ఇంకొకవిధంగా చెప్పవచ్చు. పరస్పర ప్రయోజనాలకు అనుగుణంగా ఉండే విజయం ఎల్లవేళల గట్టిపునాది కలిగి ఉంటుంది"

సంప్రదింపులనేవి రకరకాలవారి స్వార్థాలను సమ్మిళితం చెయ్యడమే అయితే అంతర్జాతీయ జీవనంలో వివిధదేశాలకు సంబంధించిన స్వార్థవిషయాలు పరస్పర విరుద్ధంగా ఉంటాయి. ఎవరైతే ఈ విషయాన్ని గుర్తించరో వారు వాస్తవికప్రపంచంలో నివసించరని అర్థం. మానవుల ఊహాలు ఆశాసౌధాల వల్ల కలిగిన విధానాలను అమలుపెట్టడానికి ప్రయత్నిస్తే దాని

వలన తీవ్ర ఉపద్రవాలే సంభవిస్తాయి. ఈ రోజున ఇదే పెద్ద గడ్డుసమస్య. దీనివలన సంప్రదింపులకు కావలసిన సామరస్యం లభించదు.

ఏదైనా ఒక సంప్రదింపువిషయంలో ఒక తృప్తికరమైన ఒక గౌరవనీయమైన రాజీకి మనం వచ్చామంటే మనం లొంగిపోయినట్లుకాదు. మనం విజయం సాధించినట్లే. మన ఎదుటి శత్రువాడు బలవత్తరమైన శత్రువే అయినా ముమ్మాటికీ ఇది నిజమే. ఈ విధమైన ఒడంబడిక చేసుకోవడంవల్ల శత్రుత్వాన్ని సహనంలోకి మార్చుతున్నారు. కాలం గడచినకొలదీ ఆ సహనమే సహకారంగా కూడా మారవచ్చు.

బలవంతుడైన శత్రువుతో సంప్రదింపులు జరిపేటప్పుడు ఆ శత్రువువల్ల మనకుకలగబోయే విద్రోహాలమాట అటుంచి అప్రయత్నంగా జరిగే యుద్ధాలగురించికూడా మనం మెళుకువతో ఉండాలి. అపార్థాలవల్లకాని లేదా అనవసర భయాలవల్లకాని ఎదుటివారిమనస్సును అర్థంచేసుకోవటంవల్ల అప్రయత్నంగానే శత్రుత్వం రావచ్చు. పరిస్థితుల్లో గల గుణదోషాలు ఏమైనప్పటికీ ఆ పరిస్థితిలోని లోపాలవల్ల యావత్ప్రపంచానికే ముప్పువాటిల్లవచ్చు. అందుచేత అంతర్జాతీయ విషమపరిస్థితులను తగ్గించే ఏ చర్యకైనా మనం చాల ప్రాముఖ్యం ఇవ్వవలసిఉంటుంది.

నా ఉద్దేశంలో ఈ భిన్నాభిన్నమైన ప్రపంచ పరిస్థితుల్లో మహా విపత్తుకు దోవతీసే విషయమొకటి ఉంది. అదేమంటే, ఒక వ్యక్తి రాజకీయ విషయాలలోకాని సాంఘిక విషయాలలో కాని ఆర్థిక విషయాలలో కాని ఇంకొక

వ్యక్తితో విభేదాలున్నప్పుడు వీరిద్దరికి మధ్య ఏ విధమైన మానసిక సంపర్కం లేకపోవడమే రాజకీయ చాతుర్యంలో ఎప్పుడైనా ఒక విషయాన్ని మనం గుర్తించాలి. వ్యక్తుల మధ్య మానసిక సంపర్కానికి కల త్రోవలను ఎప్పుడూ విశాలంగాను పరిశుభ్రంగాగాను ఉంచాలి. ఎప్పుడైనా ఒకరోజు ఇరుపక్షాలవారికి ఇష్టమైనప్పుడు వారి సంప్రదింపులకు ఒడంబడికలకు అంగీకరించవచ్చు.

14వ లూయీ 250 ఏండ్ల క్రిందట ఈ విధంగా చెప్పాడు:

"బహిరంగంగా జరిగే సంప్రదింపులలో ఏ ఒక కక్షకు సంబంధించినవారైనా వారికి సంబంధించిన గౌరవ ప్రతిష్ఠలను గూర్చి వారి స్వార్థవిషయాలనుగూర్చి వారి వాదాలనుగూర్చి మాత్రమే శ్రద్ధ తీసుకుంటారు. ఎదుటి కక్షవారిమాట ఎంత విలువైనది అయినా దానిని త్రోసి పుచ్చడమే జరుగుతుంది."

18వ శతాబ్దంలో రాజ్యప్రతినిధులు రాజులే అయితే ఈ రోజు వారు ప్రజలచేత ఎన్నుకొనబడిన ప్రజా ప్రతినిధులు, పత్రికలు చదివే లక్షలాది ప్రజలు, రేడియో వార్తలు వినే వారు వారే. అంటే ఈ రోజున రాజ్యాధికారం కలిగినవారు ఓటర్లే. అందుచేత వారి ఓట్లు సంపాదించాలంటే ఈ ప్రజా బాహుళ్యాన్ని ప్రార్థించాలి. అంతేకాదు; పొగడాలి. ఈ పరిస్థితుల్లో బహిరంగసభలు, సంప్రదింపులు జరిగే పక్షంలో ఏ మాత్రం స్వేచ్ఛ ఉన్నప్పటికీ అది అంతరించిపోతుంది.

పూర్వ 14 లూయీ కాలంలో రాజ్యాధికారానికి ఎదురుగా నడడంవల్ల ప్రాణాలే పోయేవి. కాని ఈ నాడు

ప్రజావాహినికి ఎదురీదడం వలన ఉద్యోగం పోవడమో లేదా ఎన్నికలలో ఓటమో జరుగుతుంది.

ఆధునిక ప్రపంచ పరిస్థితుల్లో సంప్రతింపులనేవి సర్వ సాధారణంగా ఒక ప్రత్యేక సమావేశంద్వారా జరుగుతూ ఉంటాయి. పూర్వాంకంలె ఈ ప్రపంచ పరిస్థితుల్లో చాలా దేశాలకు సంబంధించిన సమస్యలు పరిష్కారం కావడానికి యిదొకమార్గం.

ఈ విధమైన అభివృద్ధి ఒక విధంగా చాల ముఖ్యమైంది. అయితే ఇందులోనూ కొన్ని కష్టాలు లేకపోలేదు. ఈ వివిధ దేశాలకు చెందిన ప్రతినిధులు వారి వారి దృక్పథాలతో అందరికీ సర్వసామాన్యమైన ఒడంబడికలు చేయడానికి మార్గాలు అన్వేషించే పక్షంలో ఈ ప్రత్యేక సమావేశాలన్నవి చాలా పనిచేస్తాయి. అయితే ఒక్క సమావేశంలోనే ఏ పరిస్థితులు సర్దుకోలేకపోయినా ఇటువంటివి కొన్ని నెలలు తరబడి, సంవత్సరాలు తరబడి జరపడంవల్ల చాలా ఫలితాలు యేర్పడ్డాయి.

ఈ పరిస్థితుల్లో విజయం సాధించాలంటే అందరి స్వార్థ విషయాలను సర్వసామాన్య విషయాన్ని గుర్తించడం అవసరం. అంతేకాదు. ఈ విజయం సాధించడానికి అధికారుల రహస్య సంప్రదింపులు అత్యంత అవసరం.

ఈ పై చెప్పబడిన సమావేశానికి ప్రపంచ బాహుళ్యానికంతకూ తెలిసిన బహిరంగంగా జరిపే సమావేశాలకీ చాలా భేదముంది. ఈ బహిరంగ సమావేశాలు ఒక నాటక ప్రాయం

గాను నలుగురికి చాటించుటకు గాను ఏర్పాటు చేసిన ట్లుంటాయి.

అంతేకాదు. కొన్ని పరిస్థితుల్లో ఈవిధమైన సమావే శాల్లో అసలు సంప్రదింపులకు కావలసిన వాతావరణమే వుండదు. అందుచేత బహిరంగ సమావేశమన్నది నాటక ప్రాయంగా ఉండవచ్చు కాని దానివలన ఫలితాలు కలుగు తాయి అనుకోవడం చాలా పొరబాటు. ప్రజల ఉద్రేకం హద్దుమీరినప్పుడు ఈ సమావేశాల్లో జరిగే చర్చలు నిస్సా రంగా కనిపిస్తాయి.

అందుకనే నా ఉద్దేశంలో రాజకీయ నిపుణత కార్యం అనేది నిపుణులకే ఇవ్వాలి. ఎందుచేతనంటే ఆ వృత్తిలో శిక్షణ పొందినవారుకాబట్టి నిరాడంబరంగా ఈ సంప్రదింపులు జరపడానికి సంతోషిస్తారు.

ఒకవేళ ఈ రాజకీయ నిపుణుల ద్వారా ప్రభుత్వాల మధ్య ఒడంబడికలు కుదరకపోయినా కనీసం ఎంతకాలానికైనా కుదర్చడానికైనా ప్రయత్నిస్తారు. అందుచేత ఏ సమావే శాలలోనైనా విదేశాంగ మంత్రులు పాల్గొనడం, వారి తాలూకూ నిపుణులు, సలహాదారులు, సలహాదారులకు సలహాదారులు, తెరచాటున వుండి ఆడించేవారు రహస్య సలహా దారులు వున్ననాడు పరిస్థితులు మరీ అధోగతి పాలవతాయి.

అంతేకాదు. ఆ పరిస్థితిలో ఒడంబడిక కుదరనినాడు ప్రజలలో ఒక ఆందోళన బయలుదేరి అసలు ఒడంబడికే కుదురదు అన్న నిర్ధారణకు అందరూ రావటం తటస్థిస్తుంది.

దానివలన నిరుత్సాహం నిరాశా ఏర్పడతాయి. అందువలన ఇతరులను దూషించడం మొదలైనవి జరుగుతాయి.

దీనివలన సంప్రదింపులలో ఏమాత్రం లోపం వచ్చినా లేదా ఓటమి వచ్చినా "నిష్కల్మషమైన సంప్రదింపులు జరిగే" యని, "విశిష్టతరమైన మనోభావాలు ఏర్పడ్డా" యని వార్తలు మనం వింటున్నాం.

అందువల్లనే కమ్యూనిస్టు ప్రభుత్వాలలో ఏదైనా సమావేశానికి ముందు ప్రజలలో చాలా హడావిడిగా ప్రచారం చెయ్యడం, ఆ సమావేశం సఫలం కాగానే ఎదుటివారి మీద దుమ్మెత్తి పొయ్యడం జరుగుతుంది.

# 5

## బహిరంగలౌక్యం : ఐక్యరాజ్యసమితి

పాతకాలపు రాజకీయపద్ధతులు చర్యలు, నూతన రాజకీయచతురతకు చోటిస్తున్నాయి. క్రిందటిప్రకరణంలో నేను వివరించిన కొన్ని లొసుగులు ఈ క్రొత్తరాజకీయచతురతలో లేకపోలేదు. అంతర్జాతీయ రాజకీయసమావేశాల్లో రూపొందినదే ఈ నూతన రాజకీయచతురత. వీనిలో ముఖ్యమైనది ఐక్యరాజ్యసమితివర్గాలలో ప్రవర్తిల్లుతోంది. ఇక్కడ రాజకీయ విధానమంతా బట్టబయలే. వివిధతత్వాల ప్రచారశక్తుల ప్రభావం బాగా ఉంటుంది. అపార్థాలకు చివరకి దుర్వినియోగానికికూడా ఆటపట్టు అవుతోంది.

కాని ఈ విషయాన్ని పురస్కరించుకొని ఐక్యరాజ్యసమితిని విమర్శించేవారు రెండువిషయాలు మరచిపోతున్నారు. మొదటిది: అతితీవ్రమైన సంప్రదింపులు రహస్యంగానే ఈ సమితిలో జరగడానికి అవకాశం ఉంది. అది జరుగుతూఉందికూడ. రెండవది : ఈప్రపంచవ్యవస్థ సంప్రదింపులుజరగడానికి కావలసిన వాతావరణం ఏర్పరచడమే కాక ఇంకా మిగతావిషయాలలో కూడ కృషిచేయవలసి ఉంటుంది.

నా స్వానుభవంవల్ల నేను తెలుసుకొన్న విషయమేమంటే నిర్మాణాత్మకమైన రాజకీయ సంప్రదింపులు మేన్

హాట్టన్ భవనాల్లో నిరంతరం జరుగుతూనే ఉంటాయి. అంతే కాని బహిరంగ సమావేశాల్లో ఈ చర్చలు జరగవు. ఈ రహస్యమైన రాజకీయచర్చలకు సంప్రదింపులకు శాశ్వత ప్రతినిధుల కార్యాలయాలు చిన్నచిన్న సభలు జరిగే గదులు మామూలుగా ఉపయోగిస్తారు. తూర్పునదికి ప్రక్కనేఉన్న ఉద్యానవనాల్లో అందులోఉన్న ఫలహారశాలల్లో ఈ రహస్యమైన సంప్రదింపులు జరుగుతూఉంటాయి. ఎక్కడైతే కనుచాటుగా ఉంటుందో అక్కడంతా ఈ సమావేశాలు జరగడానికి అవకాశముంది.

ఈ విధంగా రెండవవిషయం గురించి చెప్పాలంటే ఈ ఐక్యరాజ్యసమితి అసలు అంతరార్థం అర్థంచేసుకోవాలి. దీని ముఖ్యోద్దేశం పార్లమెంటరీవిధానం. ఈ విధానానికి అనుగుణంగా ఈ ఐక్యరాజ్యసమితిలో బహిరంగ సమాలోచనలకూ అవకాశముంది; తరతరాలనుండి వస్తూవున్న రహస్య సమాలోచన సాంప్రదాయాలకు అవకాశముంది. ఏదైనా ఒక విషయంపైన బట్టబయలుగానే వాదోపవాదాలు జరపడం, పరస్పరవిరుద్ధాలైన అంతర్జాతీయ స్వార్థాలను సమ్మేళనం చెయ్యడం జరుగుతుంది. ఆ తరువాత మిగిలినవిషయాలు రహస్య సమాలోచనల ద్వారా కొనసాగుతాయి. ఇందులో ఒక్కవిషయం గమనార్హం. వివిధదేశాల స్వార్థాలగూర్చి చర్చించడమేకాకుండా యావత్ప్రపంచానికి సంబంధించిన అన్ని దేశాలను సర్వసామాన్యమైన కొన్ని విషయాలు ఉన్నాయని ప్రజలలో ఒక రాజకీయ చైతన్యం ఏర్పడ్డానికి బహిరంగంగా

ఈ చర్చలు చాలాతోడ్పడతాయి సంప్రదింపులనేవి రాజకీయ చతురతలో ఒకభాగంమాత్రమే.

ఈ విషయాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకోవడం వల్ల అంతర్జాతీయసమితి నిజతత్వం బాగా అర్థం అవుతుంది. ఈ సమితి విలువను సరిగా అర్థం చేసుకోవాలంటే ఈ సమితి రాజకీయ సంప్రదింపులకు వేరొకమార్గం అని తలచరాదు. ఈ సమితి వివిధ రాజ్యాలు వివిధప్రజలు ఒకే కుటుంబం అని తెలియజేసే చిహ్నం. ఈ ప్రపంచకుటుంబమనేది ఒక స్వప్నమే కావచ్చు. అయితే దానినే లక్ష్యంగా పెట్టుకొని ఆ లక్ష్యసిద్ధి కోసం మనం పాటుపడాలి. మిగత చిహ్నాలవలె ఈ ఐక్యరాజ్య సమితి ఒక జండాతోకాని మరి ఏ యితరమైన ప్రాణరహితమైన వస్తువుతోగాని పోల్చడానికి వీలులేదు. ఈ సమితి అనేది ప్రజల కూటమి. ఈ సమితిలోనుండి ఆదర్శ ప్రజా కుటుంబాన్ని ఉత్పన్నం చెయ్యవచ్చు. ఇదికాక మరి ఏ విధానమైనా ఉందా? ఈ ఉదజనియుగంలో ఇక ఏ విధంగా ప్రపంచానికి తావుంది?

టెన్నిసన్ రచించిన "పార్లమెంట్ ఆఫ్ మేన్" అన్నది యీ సమితి భావాలను దృష్టిలో పెట్టుకొని వ్రాసిందే. యీ లక్ష్యం మనం సాధించలేకపోవచ్చు. ఇంతవరకు సాధించలేం అన్న విషయాన్ని బట్టి ఇక సాధించలే మనరాదు.

ఈ అంతర్జాతీయ సమితిని అభిమానించేవారు యీ సమితి ఇంకా శైశవదశలో ఉన్నదని వాదిస్తారు. అయితే యీ సమితి ఆయుపునుగూర్చి మాత్రమే ఆలోచిస్తే నా వాదనపట్ల ఏ మాత్రం సానుభూతి లేదు. యెన్ని సంవత్సరాలన్నది ప్రశ్న కాదు. ఈ అంతర్జాతీయ సమితి బలవత్తరమైనదా లేక బల

హీనమైనదా అనేవిషయం ఇందులో పాల్గొంటున్న వ్యక్తులు, మానవ కుటుంబాన్ని ఐక్యం చెయ్యడానికి ఎంతవరకు వారి జీవితాలు అంకితం చేస్తున్నారు అన్న విషయంపై ఆధారపడి ఉంది. ప్రపంచమానవుల విజ్ఞానవికాసం నైతికగుణాలు అన్నవి ముఖ్యంకాని యీ సమితి ఇన్నేళ్ళబట్టి పనిచేస్తున్నది అన్నది ముఖ్యంకాదు.

ఈ చిహ్నంతోపాటు యీ సమితితోగల అధికార పత్రంలో కొన్ని సూత్రా లున్నాయి. ఆ సూత్రాలను పాటి స్తామని యిందులో పాల్గొన్న ప్రభుత్వాలు వాగ్దానాలు చేశాయి. అయితే యీ సూత్రాలు పూర్తిగా సరియైనవి కాకపోవచ్చు. మంచిదని మాత్రం ఒప్పుకు తీరాలి.

అంతేకాకుండా యీ సమితి పత్రంలో కొన్ని ప్రాతి నిధ్య సంస్థలకు తావుంది. ఈ సంస్థలకు తిరిగి మిగత సంప్రదిం దింపులు జరుపుకొనే విషయంలో శక్తిసామర్థ్యాలకి కావలసిన అవకాశం ఉంది. అందువల్ల ఈ అధికార పత్రానికి అను గుణంగా వెళ్ళాలి అని ఒక నిశ్చితాభిప్రాయం ఏర్పరచుకొంటే రాజకీయరంగంలో మనం సాధించలేని పని ఉండదు.

ఈ ప్రాతినిధ్య సంస్థలు ఏవి అంటే - సామాన్యసభ, భద్రతామండలి, ట్రస్టీషిప్ కౌన్సిల్, E. C. O. S. O. C. ఈ సంస్థలు చాలవఱకు పార్లమెంటరీ విధానంపైన నడుస్తూ ఉంటాయి. వీని నిజమైన విలువ ప్రజాభిప్రాయాలను కేంద్రీకరిం చడంలోను వివిధపక్షాలవారికి చెందిన అభిప్రాయాలను వ్యక్తీ కరించడంలోను ఆధారపడి ఉంటుంది. అందుచేత ఉన్న సమ స్యలను ప్రజా బాహుళ్యానికి అందించి తద్వారా వారు చూప

వలసిన బాధ్యతలను గుర్తుపరచి ప్రభుత్వాలు చేయు ఒడంబడికలను బాధ్యతాయుతంగా యీ సమితి యేర్పరుస్తుంది.

జాతీయ స్థాయిలో జాతీయ సమస్యలు ప్రజలకు అర్థం అయ్యేటట్లు చెయ్యడానికి 'లెజస్లేచర్స్'లో వాదోపవాదాలు జరుగుతూ వుంటాయి. యీ వాదాలవలన రకరకాల సమస్యలు, ఆ సమస్యల సారాంశాలు ప్రజలకు బాగా అర్థం అవతాయి. ఇదేవిధంగా అంతర్జాతీయ సమితిలో అందులోనూ ప్రత్యేకంగా సామాన్య సమావేశంలో జరిగే చర్చలు అంతర్జాతీయ స్థాయిలో యీ విధంగానే తోడ్పడతాయి.

మరోవిషయం గమనించాలి. సర్ హెరాల్డు నికల్సన్ చెప్పినట్లు సంప్రదింపులు ద్వారా జరిగే రాజనీతిలో ఉపన్యాసాలు దంచడంకాని, నిందాపనిందలు వేయడంకాని, దూషణ వాక్యాలు ప్రయోగించడంకాని అసందర్భమే అవుతుంది. పార్లమెంటులో వాదోపవాదాలు జరిగేటప్పుడు ఇవి ఉండకుండాపోవు. ఆయన మరోసంగతి చెప్పారు. సంప్రదింపుల సమయంలో స్వంత డబ్బా వాయించుకోవడంవల్ల స్వదేశీయులకు సమ్మతమైనా, ప్రతిపక్షులకు కోపకారణం, తనకు వృథాప్రయాస మాత్రం మిగులుతుంది. అమెరికా కాంగ్రెసు మెంబరుకి బ్రిటిష్, కెనడా, ఫ్రెంచి పార్లమెంటులలో మెంబర్లకి ఆఖరకు ఐక్యరాజ్య సమితిలో కూడా యీ ప్రచారక ఉపన్యాసాలు మామూలే. ప్రజాస్వామ్యంవల్ల ఇంకా ప్రారంభదశలో వున్న అంతర్జాతీయ ప్రజాస్వామ్యంవల్ల కలిగిన నష్టాల్లో ఇదొకటి.

జాతీయ ప్రభుత్వాలకు సంబంధించిన విషయాలలో చాలా సంప్రదింపులు జరుగుతూనే వుంటాయి. ప్రజా సమావేశాల్లో జరిగే చర్చలతోబాటు రహస్య సంభాషణలు కూడా జరుగుతూ వుంటాయి. అసలివి లేకుండా ప్రభుత్వం నడపడమే సాధ్యంకాదు. సంప్రదింపులు కార్యాలయాల్లోను ప్రభుత్వానికి సంబంధించిన వివిధ శాఖలకు చెందిన ప్రభుత్వోద్యోగుల మధ్యా జరుగుతూ వుంటాయి. ఫలహార విందులు చేసేటపుడు ఇటువంటి సంప్రదింపులు జరగడం సామాన్యమే.

ఈ సమాలోచన లన్నింటికి ఒక సర్వసామాన్యమైన విషయముంది. ఈ సమావేశాలు రహస్యంగా జరుగుతాయి. యీ రహస్యమనేది ఏ పాపబుద్ధితో చేసిందీ కాదు. అది లౌకిక జ్ఞానానికి ఒక నిదర్శనం. అయితే యీ విధానం కాని యీ సూత్రంకాని పార్లమెంటు అవసరాలకు ఎప్పటికీ అభ్యంతరంగా వుండదు.

దీనికి సరిసమానంగా అంతర్జాతీయ సమితిలో చర్చలు ఒక దృష్టాంతం.

ఈ సమితిలో తీసుకోనబడే నిర్ణయాలు చాలవఱకు "సలహాలు"గా వుంటాయి. అనగా ప్రభుత్వాలని కొన్ని విధానాలలో హెచ్చరించడంకాని లేదా కొన్ని నిర్ణయాలకు రావడానికి కావలసిన సాధన సంపత్తిని చూపడంకాని జరుగుతూ వుంటాయి.

కొన్ని ప్రత్యేక సమావేశాల్లో పాల్గొనడానికి ముందు ఆ సమావేశాల ఆవశ్యకతనుబట్టి ముందు సమితిలో తీర్మాన రూపకంగా సూచింపబడతాయి. అంటే యీ అంతర్జాతీయ

సమితి అట్టి సమావేశాలను దాని ఆధ్వర్యంక్రింద జరిపిస్తున్న దన్నమాట.

కొన్ని సంవత్సరాలక్రితం మార్షల్‌పథకానికి సంబంధించిన ఆర్థికసహాయంగూర్చిన విషయాలు చర్చించడానికి పాశ్చాత్యయూరపుదేశాలలో ఒక అంతర్జాతీయవ్యవస్థకు అవసరం ఏర్పడింది. ఈ వ్యవస్థ "యూరపుదేశపు ఆర్థికసహాయ సంఘం" ద్వారా రూపొందిది. అలాటిసందర్భాలలో యీ ఆర్థికసహాయసంఘం అంతర్జాతీయసమితికి ఉపసంఘంగా ఎందుకు ఉండకూడదు? దానికి కావలసిన తీర్మానాన్ని సమితి ద్వారానే చేయవచ్చును. ఈ వ్యవస్థ సర్వస్వతంత్రంగా ఉండవచ్చు. ఇప్పుడు ప్రస్తుతం అందులో వున్న ప్రభుత్వాలే ఉండవచ్చు. ఇప్పుడున్న అధికారులే ఉండవచ్చు. ఇక ఉన్న తేడా అంతా అంతర్జాతీయ ఐక్యసమితి అన్నది నామమాత్రం. అయితే యీ తేడా చిన్నదేమీ కాదు.

ఈ దృష్టాంతాన్ని ఎందుకిస్తున్నానంటే దీనిద్వారా అంతర్జాతీయసమితిని అభివృద్ధిలోనికి తీసుకురావడానికి ఇదొక మార్గం.

రాజకీయ విషయాలలోను, భద్రతావిషయాలలోనూ యీ అంతర్జాతీయ సమితిచర్యలను గూర్చికాని కార్యసామర్థ్యాలనుగూర్చికాని నేను ఇక్కడంతగా చెప్పదలచుకోలేదు. కాని యీ సమితిలో జరిగే రాజకీయచర్చలు నిర్ణయాలు మాత్రం ప్రపంచపరిస్థితులను మార్చడానికి చాలవటును కారణమాతాయని నా విశ్వాసం. యీ చర్చల నిర్ణయాలవల్ల క్రొత్తరాజ్యాల నిర్మాణం జరిగింది. ప్రాతరాజ్యాలు కొన్ని

కాపాడబడ్డాయి. దురాక్రమణ ఎదుర్కొనబడింది; ఓడింప బడిందికూడా.

అంతేకాకుండా ఈ సమితిచర్చలవల్ల నిర్ణయాలవల్ల సాంఘికవ్యవహారాల్లోనూ ఆర్థికవ్యవహారాల్లోనూ అంతర్జాతీయప్రాబల్యం ఎక్కువైంది. అంతేకాదు. దారిద్ర్యాన్ని' రోగాన్ని, అజ్ఞానాన్నిగూర్చిన సమస్యల పరిష్కారంలో కూడ చాలా ఉపకరించింది.

2000 వేల సంవత్సరాలకు ముందు అరిస్టోటల్ అను వ్యక్తి ఈ రాజకీయ విధానాలలోగల సూత్రాన్ని గ్రహించి ఏనాడో యీవిధంగా అన్నాడు. 'ప్రజాస్వామ్యం అన్నది సాధించినతర్వాత ఎప్పటికైనా బీదరికం పోగొట్టుకోవడానికి తమఓటు హక్కును వినియోగిస్తార'ని ఆయన అభిప్రాయం. నిజంగా చాలవరకు జరిగిందికూడా అంతే.

ఇదేవిధంగా అంతర్జాతీయ స్థాయిలోకూడా జరగడం ప్రారంభమైంది. ఈ అంతర్జాతీయ సర్వసామాన్యసభలో బీద వారికే ఒకవిధంగా అధికప్రాబల్యం ఉంది. ఇది వారు గుర్తించడంలో ఆశ్చర్యమేమీలేదు. యీవిధంగా జరిగినందువల్ల దైన్యానికి కారణం కాకూడదు.

యీ ఐక్యరాజ్యసమితి లోపాలమాట ఏమిటి?

చాలా తీవ్రమైన లోపమేమంటే ఈసమితిలోగల సభ్యుల 'వీటోహక్కు' జర్మనీ జపాన్ ఇటలీ మొదలైన దేశాల ప్రాతినిధ్యం లేకపోవడం ఇంకొక తీరని నష్టం. ఇంతేకాక గడ్డు సమస్యగా పరిణమించినది చైనా దేశపు ప్రాతినిధ్యం. ఇది నిజానికి ఒక సాంకేతిక సమస్యకాదు. రెండు ప్రభుత్వాలమధ్య

సంఘర్షణ. దీనివలన చైనా భూభాగానికి సంబంధించిన నిజమైన ప్రాతినిధ్యం యీ సమితిలో లేదు. దానివలన చైనా భూభాగానికి దగ్గరలో ఉన్న – కొరియా, ఫార్మోసా, ఇండోచైనా దేశాల పరిష్కారం దుస్సాధ్యంగా ఉంది. సంప్రదింపులతోనూ సామరస్యంతోను తదితర శాంతియుత మార్గాలతోను ఇట్టి సమస్యలు పరిష్కరించబడాలంటే కమ్యూనిష్టు చైనా ఐక్య రాజ్యసమితికైనా వెళ్ళాలి; లేదా ఐక్యరాజసమితి చైనాకైనా రావాలి. దీనికి ప్రమాణపూర్వకమైన ప్రత్యక్ష నిదర్శనం యేదంటే 1954 లో జనీవాలో జరిగిన దూరప్రాచ్య మహాసభయే.

ప్రపంచంలో కొన్నిచోట్ల రాజ్యాలను విభజించే రెండు ప్రభుత్వాధిపత్యాలమాట అటుంచి సభ్యత్వాన్ని గూర్చిన క్లిష్టసమస్యలు "సర్వాంగీకారవ్యవహార పద్ధతి" ద్వారా పరిష్కరింపగలం. రాజ్యాల విభజన, ఆ రాజ్యాలకు ఐక్యరాజ్య సమితిలో జరిగిన కాలవిలంబన ప్రత్యక్షయుద్ధంయొక్క తాత్కాలిక దుష్ఫలితమే. ఏ విషయంలోనైనా పురోభివృద్ధి చెందడానికి సాంప్రదాయకమైన పద్ధతి, రాజీపడడం అన్నవి యీ సర్వాంగీకార వ్యవహార పద్ధతికి మారుపేర్లు.

సభ్యత్వాన్ని గూర్చిన ప్రశ్న అటుంచి ఐక్యరాజ్య సమితి కార్యయంత్రాంగం సులభసాధ్యంగా ఉండడంచేత వీటో సమస్య ప్రధానంగా పరిగణించవలసిన అవసరం లేదని నా అభిప్రాయం. రష్యావారు తమకు భద్రతామండలిలో గల తమ వీటోద్వారా ఐక్యరాజ్యసమితిలోని అధిక సంఖ్యాకుల సామాన్య సభద్వారా నిశ్చితాభిప్రాయాలను, భౌతికంగా

చేయగల కార్యాన్ని నివారించలేరు. 'చిన్నసభ', 'శాంతి కొఱకు కలయిక' మొదలైన ఉపకరణాలు ఒక విషయం సూచిస్తున్నాయి. పైకి ఎన్ని ఆటంకాలు కనబడినా పురోభివృద్ధి సాధ్యమనీ అది రాజకీయవేత్తల రాజకీయచట్టం తెలిసిన న్యాయవాదుల మేధాశక్తికి అతీతం కాదనీ తేలిపోతుంది. ప్రజాస్వామ్య సంఘాల దృఢతరమైన అభివృద్ధికి రాజ్యాంగచట్ట సంబంధ నియమావళి దాని కార్యాచరణలో గల సానుగుణ్యత మేధా సంపన్నత చాలా తోడ్పడ్డాయి. ఈ విషయం ఇంగ్లాండు లేదా సంయుక్తరాష్ట్రాలు లేదా తదితర ప్రజాస్వామ్యానికి సంబంధించిన రాజ్యాంగచట్ట చరిత్రను చదివిన ప్రతి విద్యార్థికి తెలుసు.

కొన్ని దేశాల సభ్యత్వ లేమిని గూర్చి విచారం వెలిబుచ్చినా ప్రపంచవ్యవస్థలో రష్యా తదితర కమ్యూనిష్టు దేశాలు పాల్గొనడం దాని బలహీనతను తెలుపుతోందనేవారు కొందరున్నారు. ఈ విషయం ఆలోచించదగినదే. ఐక్యరాజ్య సమితిలో పాల్గొని కమ్యూనిష్టు రాజ్య ప్రతినిధులు చేయు చర్చలు వారి దేశాల సరిహద్దులు దాటి ఇతర ప్రజానీకపు అభిప్రాయాలను వశపరచుకొనడానికి ఈ ఐక్యరాజ్య సమితిని ఒక ప్రచార రంగంగా ఉపయోగిస్తున్నారు. ప్రజలను వార్తలను కట్టుబాటులో వుంచి సమాచార నిషేధాల ద్వారా రవాణా సౌకర్యాలను స్వాధీన పరచుకోవడంవల్ల ఐక్యరాజ్య సమితిలో జరుగుతున్న చర్చల ప్రభావం కమ్యూనిష్టు దేశాలలోగల ప్రజలలో ఏమీ కన్పించదు.

యీ 'ఇనుప తెర' సారాంశం ఏమంటే కమ్యూనిస్టు దేశాలలోని ప్రజానీకానికి తదితర ప్రపంచ దేశాలకు సంబంధ బాంధవ్యాలు లేకుండా చెయ్యడమే. సోవియట్ రాజ్యాంగ తత్వం ఏవిధమైన స్వేచ్ఛకు ఎడమీయదు. వ్యక్తుల మధ్య సన్నిహిత సంబంధాలు పెంపొందుతాయేమో నన్న భయం సోవియట్ నిరంకుశాధికారానికి మూలాధారం. అందుచేతనే కమ్యూనిస్టు అధికారులు తమ దేశాలలో వ్యక్తులకుగల సన్నిహిత సంబధాల అభివృద్ధిని నివారించడానికి ప్రయత్నిస్తారు. 'ఇనుప తెర' అని మనం అనుకున్నది ఒక విధానం. దీనివలన భూభాగంలో మూడవ వంతు ప్రజలు వారి స్వాధీనంలో వుంటారు.

ఈ ఇనుప తెర అనేది ఐక్యరాజ్య సమితికి గొడ్డలి పెట్టు వంటిది. కమ్యూనిస్టు నాయకులకు ప్రప్రథమ సూత్రం ఏదంటే ప్రపంచంలో ఏరంగంలో నయినా తదితర దేశాలతో గల సంబంధం సంకుచితమైంది. ఇది గ్రహించకపోతే మన లను మనం మోసం చేసుకున్నట్లే.

తమ దేశపు ప్రజలు ప్రపంచ వాస్తవిక పరిస్థితులను గూర్చి వినడం, చూడడం కమ్యూనిస్టు నాయకులకు ఎంత భయంకరమైనప్పటికీ మన మనోభావాలు మాత్రం వారికి వ్యతిరిక్తంగా వుండాలి. పౌరులు ప్రపంచ పరిస్థితులను సరిగా అర్థం చేసుకోవడం లేదేమో అన్న భయం మన కుండాలి.

అంటే దీనిఅర్థం ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వానికి సంబంధించినంతవరకు కమ్యూనిస్టు ప్రతినిధులు లేనిపక్షంలో సర్వసామాన్యసభ ప్రజాస్వామ్యాలకు నిరుపయోగంగా

వుండేవి. యూరప్ దేశంలోగల కమ్యూనిష్టు రాజ్యాల ప్రతినిధులరాక సోవియట్ సభ్యులతో మనకుగల అనుభవాలు వారి మూర్ఖత్వం ప్రజలకు జ్ఞానోదయాన్ని కలిగించాయి. దీనితో రష్యావారితోగల చిక్కులు వాటిని పరిష్కరించు మార్గాలుకూడా చాలా తెలిశాయి. కమ్యూనిష్టువారిని వారే బయట పెట్టుకున్నారు. వారి బలాబలాలు బయట పడ్డాయి.

ఈ కమ్యూనిష్టులు పాల్గొనడంవలన కమ్యూనిష్టులు కాని తదితర ప్రభుత్వాలవారికి మధ్య సామరస్యం బాగా ఏర్పడింది. ఇదే ప్రధాన కారణంగా తీసికొని కమ్యూనిష్టులు పాల్గొనడం మంచిదని నేను వాదించడంలేదు. అయితే ఇదికూడా ఒక కారణమే. రష్యావారు వారి మిత్రులు ఐక్యరాజ్య సమితిలో లేకపోవడమే మంచిదని ఆలోచించే ప్రజలకు ఈ విషయం సూచిస్తున్నాను.

రష్యా ఐక్యరాజ్య సమితిలో పాల్గొనడం చాలా ముఖ్యమైంది అనడానికి నా అసలుకారణం ఏమంటే దీనివలన అంతర్జాతీయ విధానానికే ఒక ఆదర్శపాత్రయంగా వుంది. ఈ ఆదర్శం గుర్తించడంవలన మన శత్రువులతోకూడా మన సన్నిహిత సంబంధాన్ని చాటుతుంది.

బట్టర్ ఫీల్డు పండితుడు దీనిని తనపుస్తకంలో స్పష్టీకరించాడు.

"అంతర్జాతీయ క్రమపద్ధతి కలిగిఉండాలన్నా ఆ పద్ధతిని నిలబెట్టడానికి కావలసిన అధికారం ఉండాలన్నా యుద్ధానికి దారితీసే పెడమార్గాలను (ప్రచ్ఛన్న యుద్ధమైనా) ముందు

నీవు తొక్కకూడదు...అంతర్జాతీయ క్రమపద్ధతి ఉన్నంత వరకు. ఉండాలి అని మనం ఆశించినంతవరకు యుద్ధం అన్నది వచ్చినా అది స్నేహితులమధ్య తగాదాలాగ ఉండాలి."

స్వేచ్ఛాసంఘం సుగుణ సంపత్తికి అనుకూలంగా ఉన్న శాంతిసాధనమే మనవిధానపు ఉత్కృష్ట గమ్యస్థానం. ఈ అన్వేషణలో సమిష్టిభద్రతకు కూటాలు ప్రముఖపాత్ర వహించవలసి వుంటుంది. ఉత్తర అట్లాంటిక్ సంధివ్యవస్థ మొదలైనకూటాలు దురాక్రమణను అరికట్టడానికై సాహజంగా పాటుపడుతున్నాయి. యీ మాటల్లో భయాన్ని, అపనమ్మకాన్ని కలిగించే రాజ్యాలకు సభ్యత్వం లేదు. యీ భయం, అపనమ్మకం ఇట్టి రక్షణకూటాల స్థాపనలు అవసరమైనవి. అయితే ఐక్యరాజ్యసమితి దురాక్రమణను అరికట్టడానికంటె నిగూఢమైన దీర్ఘకాలికమైన విధమొకటి ఉంది. అది మన అంతిమ గమ్యస్థానం సామరస్యమేనని అందరు మానవులు ఏదో ఒక రోజున సర్వమానవ సహోదర వాత్సల్యం ప్రదర్శింపగలరని జ్ఞప్తిచేయడమే. అందుచేత సామరస్యంతోను, సహకారంతోను భావిశత్రువులుకూడా యీ ప్రపంచ వ్యవస్థలోనే ఉండడం మంచిది.

అందుచేతనే ఐక్యరాజ్యసమితికి సంబంధించిన ప్రాతినిధ్య వ్యవస్థలైన సామాన్యసభల మండలాల విలువనుగూర్చి నేను నొక్కి వక్కాణించాను. సంప్రదింపులకు ఇవి చాలా అవసరమైనవని కాదు. ఫలప్రదాతలైనవనీకాదు. వీటిద్వారా ప్రభుత్వాలపై ఒకవిధమైన ప్రభావం కల్పించి సంప్రదింపులకు దోహదమువతాయి. అంతేకాక మానవజాతి అంతటికీ సర్వ

సామాన్యమైన ప్రపంచవిధాన లక్ష్యాలను మనకు కనిపింప జేస్తాయి.

ఇంతకూ నేను చెప్పే సారాంశం ఏమంటే ఐక్యరాజ్య సమితి ముఖ్యోద్దేశం ప్రపంచ ప్రధానసమస్యలను తగిన ప్రమాణాలలో మనకు చూపడమే. యీ విషయాన్ని గురించి చెప్పడానికి 1954లో ఐక్యరాజ్యసమితి సర్వసామాన్యసభలో ప్రసంగించేటప్పుడు నేను సాహసించాను.

"సాంకేతికవిధానాలు అణ్వస్త్ర శాస్త్ర అభివృద్ధి మానవజాతిని పరస్పరాధారభూతంగా చేశాయి. ఈ విషయాన్ని ప్రజాభిప్రాయం కాని ప్రభుత్వాలు కాని సరిగా గుర్తించలేదు. దురదృష్టవశాత్తు పరస్పరాధారాలు పెరిగిన కొలది మనలో గల విభేదాలుకూడా హెచ్చుతున్నాయి. మనలో సామరస్యం కుదరకపోతే యీ సమస్యలు అందర్నీ సర్వనాశనం చేస్తాయన్న విషయం ఐక్యరాజ్యసమితి ప్రాముఖ్యాన్ని ఇనుమడించింది."

"ఈ విభేదాలుగూర్చి ఏది చేయ్యాలన్నా వాటిని ముందు గుర్తించి అవగాహన చేసుకోవాలి" మొదటి విషయం నిరంకుశత్వ ప్రభుత్వాలకు స్వేచ్ఛాసంఘాలకు మధ్య మూల కారణమైన విభేదం ఉంది. నిరంకుశ ప్రభుత్వాలలో పౌరుడు రాజ్యానికి బానిసవంటివాడు ఈ ప్రభుత్వాలు శాంతి అని సహజీవనం అని ఎన్ని కబుర్లు చెప్పినా అంతర్జాతీయ విషయాలలో అభివృద్ధి పొందడానికి బలప్రయోగం దురాక్రమణ

అన్నవి వారికి పరిపాటైపోయింది. అయితే స్వేచ్ఛా సంఘాలలో మానవునికి రాజ్యాలను ప్రభుత్వాలను అధిగమించిన హక్కులు బాధ్యతలు ఉన్నాయి. వీటిని తన స్వేచ్ఛను, భద్రతను న్యాయరీత్యా రక్షించుకోడానికి మానవుడు సృష్టించిన వే".

"స్వయం పరిపాలనా ప్రభుత్వాలకు అస్వతంత్ర పరిపాలనా ప్రభుత్వాలకు మధ్య తేడా ఉంది. ఈ విభేదాన్ని చాలమంది అపార్థాన్ని చేసికొని సామ్రాజ్యతత్త్వవాదుల పరిపాలనోగల రాజ్యాలకు పరాధీయములైన రాజ్యాలకు గల అస్వతంత్ర పరిపాలనాభాగం దీనికన్నా చాలా విస్తారమైంది. ఒక నియంతచే పరిపాలింపబడే ప్రజలకు ఆ నియంత అదే జాతికి చెందినవాడైనా అదే భాష మాట్లాడేవాడైనా ఆ ప్రజలకు స్వపరిపాలనా శక్తి లేదు. సామ్రాజ్యతత్త్వవాదుల ఆధీనంలో ఉన్న ప్రజలకన్నా నియంతృత్వ ప్రభుత్వానికి ఆధీనమైన దేశాల ప్రభుత్వం మరింత హీనమైంది."

"తర్వాత ప్రపంచంలో బాగా పారిశ్రామికమైన భాగాలకు, అట్టి అభివృద్ధిలేని భాగాలకు తారతమ్యం ఇంకొకటి ఉంది. ఐక్యరాజ్యసమితి నాయకత్వాన ఈ విషయంలో మేం కొంతవరకూ ఏదైనా చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాం. ఈ విధానాలు మందంగాసాగుతున్నా నిరంతరంగా సాగవచ్చు".

"ఈ ఐక్యరాజ్యసమితి విభేదాలను బాగా గుర్తించి ఈ యిరువపక్షాలవారికి ప్రమాణపత్రాలకు విభిన్నం కాకుండా సేవ చేయడానికి ప్రయత్నించాలి".

"మన త్రోవ స్పష్టమైంది. దారిద్ర్యాన్ని పోగొట్టి ఆర్థిక సాంఘిక అభివృద్ధికి దోహదం యిచ్చేది. ఆ త్రోవ సంపూర్ణమైన స్వపరిపాలనా ప్రభుత్వాలను స్థాపించేది. అంతర్గతంగాకాని బాహ్యంగాకాని నియంతృత్వాన్ని అరికట్టేది. మానవుల హక్కులను గౌరవప్రతిష్ఠలను గుర్తించేది కూడా అదే".

# 6

# ప్రపంచ జాతుల మధ్య సంబంధ బాంధవ్యాలు

అంతర్జాతీయ రాజకీయాల మూలంగాను ప్రజాస్వామ్యం మూలంగాను వచ్చిన సమస్యల నూతన పరిణామం పరిశీలించడంలో యింతవఱకూ మనం నేడు మానవులకు లభ్యమయ్యే శక్తి యుక్తులను గమనించాం. వీటి అండలోనే యిప్పుడు ఏ సమస్యల నిర్ణయమైనా జరుగుతోంది. ప్రతి జాతి విస్తరించడం వల్ల వాటి పాత్రలు కూడా సమస్యానిర్ణయంలో మరీ ఎక్కువ అవుతున్నాయి. తర్వాత అంతర్జాతీయ రాజకీయ సంఘాలపై ఖరినీ, కార్యకలాపాలనికూడ – అందులో ముఖ్యంగా ఐక్యరాజ్యసమితి గురించి ఈ కాలంలో రాజనీతి ఎలా నడుస్తున్నదీ అన్నదానిగురించి యింతవఱకూ సింహావలోకనం చేశాం.

విదేశాంగ నీతి దానిని గూర్చిన సమస్యలుకూడా ఒక క్రొత్త ప్రమాణంలో గోచరిస్తున్నాయి. ప్రపంచ జాతుల మధ్యగల సంబంధ బాంధవ్యాలపై పైవిషయం చాలావఱకు ఆధారపడి ఉంటుంది.

అనేక శతాబ్దాలుగా యూరప్‌లో రాజనీతి అంటే అచ్చటగల చిన్న చిన్న రాజ్యాలమధ్య ఉండే సంబంధ బాంధవ్యాలూ వాటిలో అనవరతంగా కలుగుతూ ఉండే మార్పులూనూ అన్నది స్ఫురిస్తుంది. సమస్యలు ఉద్భవించేది ఏ ఒక్క జాతితో నిండిన దేశాలమధ్య కాదు. కాని జాతుల మధ్యనే.

ఈ నాటి ఆశియాఖండాన్ని తిలకిస్తే ముఖ్యంగా మనకు గోచరించేది అక్కడ ప్రాచీన సంస్కృతిని జీవితాన్ని పునరుద్ధరించాలన్న ఒక వికాశం. ప్రాచ్య దేశాలలో ఈ నాడొక నూతనోత్తేజం వెల్లివిరుస్తోంది. గతంలో ఒకప్పుడు ప్రపంచానికంతా వెలుగుచూపిన ప్రాచ్యదేశాలు ఒక శతాబ్దం క్రింద మందకొడిగా నిల్చిపోయినాయి. పూర్వ వైభవాలను, పూర్వ శోభలను స్మరించుకొంటూ పడిన మనోవేదనమాత్రం మిగిలి ఉండేది. కాని ఈ నాడు వాళ్ళందరూ స్వాతంత్ర్యాన్ని ప్రజాసంక్షేమాన్ని సాధించడానికి బద్ధకంకణులై దేశ సౌభాగ్యాన్ని గురించి కలలుకూడా కంటున్నారు.

సహృదయులైనవారందరూ ఈ వికాసాన్ని గురించి సంతోషించవలసిందే. హిందూ దేశీయులూ, ఆగ్నేయ ఆశియా ప్రజలూ ముస్లిం రాజ్యవాసులూ అందరిలోను సౌఖ్యం, సౌభాగ్యంతో నిండిన జీవితాలను సాధించితీరుతాం అనే ఆకాంక్షా అనవరతకృషీ రేగాయి. అధునాతన సాంకేతిక విజ్ఞానాన్ని తమ తమ ప్రాచీన సంస్కృతితో జోడించి వారు చేస్తున్న ప్రయత్నం ప్రపంచ ప్రజాభ్యుదయానికే దోహదకారి అవుతుంది.

ఈ నూతనోత్తేజాన్ని, ఈ నూతన చైతన్య స్రవంతినీ మనం చులకనగా చూడకూడదు. అపార్థాలు ఆపాదించ కూడదు. ప్రాచ్యభూగోళంతో వికసించిన క్రొత్త రాజకీయ సంఘాలను పాశ్చాత్యులకు ఇంతకుముందే సుపరిచితాలైన రాజ్యాలకు నమూనాలనుకోవడం పెద్ద పొరపాటు. ప్రాచీన నాగరికతల పునరుద్ధారణ నూతన వ్యవస్థకు దారి తీయగలదు. విచక్షణ దృష్టితోను, సహానశీలకతోను పరిశీలించినవారికి ఈ మార్పు భిన్నంగా కన్పించడమే కాకుండా ఆ శక్తి నికూడా కలిగిస్తుంది.

గతంలో నిర్మాణావస్థలో ఉన్న అన్నిజాతులూ తమ సరిహద్దులను దాటి విస్తరించసాగాయి. అంటే సామ్రాజ్యవా దాన్ని సమర్థించాయి అని అనుకోవచ్చు. ఈ విషయం ప్రాచ్యంలోను పాశ్చాత్యంలోనూ బుజువైంది. ఇంతవఱకు సామ్రాజ్యవాదంతో ప్రబలిస దేశాలమధ్య సంబంధాలు ఎప్పుడూ యుద్ధం,సంఘర్షణ లేకపోతే అసంతృప్తికరమైన సంధి. వివిధ దేశాలుజాతులు శాంతియుతంగా ఒకరి చరిత్రవిజ్ఞానం సంస్కృతికళారీతులు మరొకరు గ్రహిస్తే పరస్పరసామరస్యంతో ఇనుపుర జీవన వికాసాన్ని పెంపొందించుకుంటూ మెలగవలసిన యుగంలో మనం ప్రవేశిస్తున్నాం. ఇవి సాధించకపోతే జన బాహుళ్యంతో నిండిపోయిన మన చిన్నభూగోళంలో దురభి ప్రాయాలు కక్షా అశాంతి అరాచకమే వేరే మార్గం.

ఆశియాలో నాగరకతా పునర్నిర్మాణం అనే అమృత మథనానికి ముందు నిరంకుశత్వం అనే హాలాహలం పుట్టు కొస్తోంది. పూర్వం ప్రజాభ్యుదయానికై వేసిన ప్రాతిపదిక

క్రిందా చుట్టూరా అనేక అమానుషశక్తులు ఉంటూనే వచ్చాయి. కాని ఈ నాడు చరిత్రలో మొట్టమొదటిసారిగా మానవుడు నిర్మించిన నాగరికతా సంస్థలను బెదిరిస్తున్న అమానుషశక్తి ప్రబలింది. ఈ అమానుషత్వం కొన్ని చిన్నచిన్న దేశాలను కబళించేసింది కూడా. ఒక పెద్దపెట్టున నిర్మించబడిన ఈ అమానుషత్వం అప్రతిహతమైంది.

ఇటలీలో ఫాసిస్టులతోను, జర్మనీలో నాజీలతోను, రష్యాచైనాలలో కమ్యూనిస్టులతోను అనుభవం గడించిన ఈ యుగంలో నిరంకుశత్వంవల్ల వచ్చేఅపాయాలగురించి వేరే నొక్కి చెప్పవలసిన అవసరంలేదు. జీవితంలో నైతికవిలువలను త్రొక్కిపెట్టి నిరంకుశ సక్తియే గమ్యంగాచేస్తున్న వ్యాపకం తెలివైనవాళ్ళకుకూడా విపరీతమైన ఆకర్షణ నిస్తుంది. నిరంకుశత్వాన్ని సాధించటానికి అన్నివిషయాలను అందరుమనుష్యులను లోబరచుకొని చేసిన కుతంత్రంమూలంగా కొంతవఱకూ సమాజంలో ఒక ప్రబలమైనసంచలనం కలగడంకూడా తథ్యం.

ఇంకా యోచిస్తే కల్లోలజనితమైన ఈ సంచలనానికి ఆదర్శవాదంపేరున కొన్ని నినాదాలు ఊతగా ఇచ్చారు. వెనుకబడ్డదేశాలలో ఈ అసహజ సంఘసంచలనం జాతీయోద్యమాలకు తోడునీడై సంఘాభ్యుదయానికి దీక్షవహించిన అనేక కార్యశూరుల శక్తిసామర్థ్యాలను సంపాదించింది. కొన్ని దశాబ్దాలలోనే యూరపు ఆశియాఖండాలలో పదిమంది కమ్యూనిస్టులుకలసి రాజకీయంగాను సాంఘికంగాను నిస్పందన కల్గించి అనేకలక్షలప్రజలను కట్టుదిట్టాలతో పరిపాలిస్తున్నారు.

ప్రపంచాన్ని దిగ్భ్రమకొల్పించిన ఈ ప్రచండ కార్య సాధనఫలితంగా మన రాజకీయాలవైఖరి మారిపోయింది. మనలో భీతి, ఆందోళన చెలరేగింది. చివరకు 1945 నుండి తీవ్రంగా మనలను రాజకీయ కార్యకలాపానికి పురికొల్పింది.

అంతర్జాతీయసమస్య అనగానే సామ్యవాదాన్ని ఎదు ర్కొనడం అనిఅనడం, ప్రపంచపరిస్థితిని రెండు అగ్రరాజ్యాల మధ్యగల ప్రచ్ఛన్నయుద్ధమే అనడం తేల్చిచెప్పడం చాలా ప్రమాదమైనపని. మనకు ముఖ్యమైన సమస్యలు ప్రజలతోను వారి నాగరికతలతోను వారి నాగరికతా రాహిత్యంతోను, మనలను భయపెట్టేవారితో వ్యవహరించేటప్పుడు 'మార్క్సిస్టు' సిద్ధాంతాలతో నిర్మింపబడిన రష్యాచైనా సాంఘికవ్యవస్థలను జాగ్రత్తగా పరిశీలించడం ఉత్కృష్టమైన పద్ధతి. ఆశియాలో శాంతికి భంగం కలిగించే ప్రమాదపరిస్థితులను ఎదుర్కొన్న ప్పుడు మనం సామ్యవాదంగురించి తక్కువమాట్లాడి చైనా సామ్రాజ్యవాదంగురించి ఎక్కువగా ప్రచారంచేస్తే మన ప్రయత్నం సఫలమవుతుందని నా ఊహ. సామ్యవాదం అంటే ఆశియాప్రజలకు ఎక్కువ భీతిలేదు. వారికింకా ఆ వాదమే పూర్తిగా అర్థంకాలేదు.

రష్యన్ 'జార్' చక్రవర్తులగురించి బాగా చదివి తెలు సుకోవడం మాస్కో పెకింగ్‌లతో వ్యవహారంనడుపుతున్నపుడు మన కెంతో మేలు చేకూర్చుతుంది తర్కశాస్త్రం, అనాత్మ వాదం బాగా తెలిసి ఉంటే అదికూడా మరీ మేలు చేకూర్చు తుంది.

అంటే ఆదర్శవాదాన్ని విస్మరించమని నా అభిప్రాయం కాదు. ఇదికూడా మనకు ముఖ్యమైన మూలాధారమైన విషయం. కాని యీప్రాతిపదికలో విజయంచేకూరడం అంటే కమ్యూనిస్టులకు ప్రతికూలశక్తులను ప్రయోగించడం కాదు. మన వాదాలలో కల విశ్వజనీనతను మనం పునరవగాహన చేసుకుంటే అదే పదివేలు ఈ విషయంగూర్చి మరో ఉపన్యాసంలో ముచ్చటిస్తా. మన ఆదర్శాలను మనం ఎంతగా వినియోగిస్తే అంత బాగా మన నైతిక, మానసికశక్తులు ఇతరులను ప్రేరేపిస్తాయి. అప్పుడే పేలవమైన సామ్యవాదసిద్ధాంతాలను పైపై మెఱుగులన్న ప్రతిఘాత సిద్ధాంతాలని ప్రజలు పరిగణించగలుగుతారు.

నా ఉద్దేశంలో మనం ముఖ్యంగా ఎదుర్కొనేసమస్యలను నిరంకుశత్వమే చూపెడుతోంది. వాటిని తీవ్రం చేస్తుంది. కాని ఈ సమస్యలు నిరంకుశత్వంవల్ల పుట్టినవి కావు. కాబట్టి నిరంకుశత్వానికి జంకుతూ దానితో సతమతమయ్యే మనం ఎంతమాత్రం సమస్యాపరిష్కారాల ప్రయత్నాలనుంచి మనసు మళ్ళించకూడదు.

గత చరిత్రలో ఎన్నో ప్రచండమారుతాలు వీచాయి. కాని ఈ 20 వ శతాబ్దంలో నిరంకుశత్వాధికార ఫలితం వెల్లువగా ప్రపంచాన్ని అంతా ముంచివేస్తోంది. ఫ్రాన్సుదేశ చరిత్రలో సంభవించిన ఫ్రెంచివిప్లవం అనే ప్రజల తిరుగుబాటు కూడా ఇంత మహత్తరస్థితికి దారితీయలేదు.

రష్యా చైనా కమ్యూనిస్టుల సామ్రాజ్యవాదం తీసుకొస్తున్న ముప్పు ఎదుర్కొనడానికి అత్యవసరమైన చర్య

పాశ్చాత్య దేశాలన్నీ ఒక వ్యవస్థగా కూడడమే కాదు. కాగా యీ ఉపద్రవానికి సన్నిహితంగా ఉన్న పెద్దపెద్ద దేశాలమధ్య సహకారాన్ని కూడా పెంపొందించాలి.

వివిధములైన జీవితపద్ధతులుగల ప్రజలమధ్య సహకారానికి ఉన్న అడ్డంకులు ఒక ప్రత్యేకస్థానాన్ని వహిస్తాయి. పూర్వం మూడువందల సంవత్సరాలనుండి యూరపు దేశ రాజ్యాలమధ్యగల భావోద్రేకాలు మనస్పర్థలు వేలకు వేలు. ఈ స్పర్థలను సమ్మేళనంవల్ల సహకారంవల్ల మార్చడం చాలా కష్టం. అయితే జాతీయదృక్పథాలలో ఇంత విభేదాలున్నా విద్యావిషయంలో, ఆలోచనలలో చాలా పోలికలున్నాయి.

వివిధ నాగరికతల ప్రజలు ఒకరినొకరు అర్థం చేసుకోవడంలో గల అడ్డంకులు విపరీతం. ఈ అడ్డంకులు వివిధాలైన జీవిత ప్రమాణాలవలన, జాతి దురభిమానంవలన సామ్రాజ్య వాద తత్వంవలన మరింత విపరీతమైంది. కాబట్టి వివిధాలైన స్వార్థాల సమ్మేళన కుదరాలంటే నైతిక అపార్థాలు కలిగించకుండా సహనం ఓర్పు మొదలైన సద్గుణాలతో అత్యంత కృషి చేయవలసి ఉంటుంది.

వివిధనాగరకతలలోని అపార్థాలవలన కలిగే అపాయం చాలావఱకు మనోగతాభిప్రాయాలమీద ఆధారపడిఉంటుంది. ఇతరుల అభిప్రాయం అర్థం చేసుకోవడానికి ముందు మన అభిప్రాయాలను స్పష్టంగా అర్థం చేసుకోవాని.

ఉదాహరణకు ఆర్థిక సహాయాన్నిగురించి ఆలోచించండి. సంయుక్తరాష్ట్రాలు, నా స్వంతదేశం, తదితర పాశ్చాత్య దేశాలు వాటి దేశ సంపత్తిలోనుండియే కొలంబో పథకు

ద్వారా, ఐక్యరాజ్యసమితి ద్వారా, అంతర్జాతీయ బ్యాంకు ద్వారా ఆర్థికంగా వెనుకబడిన దేశాలకు ఆర్థిక సాంకేతిక సహాయం పరోక్షంగాకాని ప్రత్యక్షంగాకాని చేస్తున్నాయి.

దీనికి మూడు ముఖ్య కారణాలున్నాయి మొదటిది మానవత్వం. అదృష్టవశాత్తు ఎక్కువ సంపదలతో తులతూగుతున్నవారికి బీదవారికి సహాయం చేయాలనే నిష్కళంకమైన మనోవాంఛయే అన్నమాట. రెండవకారణం బీదవారికి సహాయం చెయ్యడం ఒక విధంగా మనకు మనం మేలు చేసుకున్నట్లే. ఇతరుల జీవితప్రమాణం ఎంత తొందరగా అభివృద్ధి చెందుతే అందరికీ అంతమంచిది. మూడవది ఆర్థికసహాయం ద్వారా శాంతికోసం సేవచేయగలం అనే ఆశ. ఒక దేశం బలవత్తరమైనపుడు దానిని ఎదుర్కోవడం అంతగా జరగదని మన దృఢవిశ్వాసం.

అయితే మిత్రులను డబ్బుపెట్టి కొనగలమని, లేదా కొనవలెనని తప్పుడు అభిప్రాయం పెట్టుకోరాదు. ఈ అర్థాన్నే కల్పించి కమ్యూనిస్టులు ఆశియాఖండమంతటా దుష్ప్రచారం సాగించారు. అది అబద్ధమని ఋజువు చెయ్యాలి. పాశ్చాత్యులు ఆశయా దేశపు గౌరవ ప్రతిష్ఠలకు వ్యతిరేకంగా ఆసియా ప్రజల నిజాయితీకి భిన్నంగా నడచారని ఆసియా దేశవాసులు నమ్మితే అది చాలా శోచనీయం.

కమ్యూనిజం అన్నది ఆకలితో ఉన్నవారికే ఆకర్షణీయంగా కనబడుతుందని జీవితప్రమాణం పెరిగిన వెంటనే ఈ ఆకర్షణీయశక్తి పోతుందనే దురభిప్రాయాన్నికూడా పోగొట్టుకోవాలి. మనుష్యులు అంత సులభులు కారు.

ఈ విషయం జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఎందు చేతనంటే దీనినిగూర్చి బాగా తప్పుడు అభిప్రాయాలున్నాయి. నియంతృత్వ అధికారుల ఉద్దేశంలో ప్రజాభిప్రాయం అన్నది సృష్టించబడవలసినదిగాను లేదా భయపడవలసింది గాను ఉంటుంది. అందువల్ల వారు ఉత్తేజకరమైన శక్తితో ప్రచార సాధనాలు అభివృద్ధిలోనికి తీసుకురావడం ఏమాత్రం సాధ్యం కాదు. మామూలుగా వారవలంబించే పద్ధతులైన పచ్చి అబద్ధాలు, చర్విత చర్వణాలు, హేతురహితమైన మనోభావాల కలగలుపు పాశ్చాత్యదేశాల్లో అందరికీ తెలిసినవే. అంతే కాదు. ఈ విధంగా సంబంధం లేకుండా ఒకటి ఇంకొకదానితో ముడిపెట్టడం అన్నదానికి ఒక మంచి ఉదాహరణ ఉంది. ఒక సిగరెట్ కాని, ఒక పానీయంకాని లేదా మోటారుకారుకాని ఎడ్వర్ టైజు మెంటుకోసం జలక్రీడా వస్త్రాలతో ముస్తాబైన ఒక యువతి బొమ్మను ప్రక్కనే వేస్తారు. అయితే పై వస్తువులలో ఏది కొన్నాకూడా ఆ అమ్మాయిమాత్రం లభించదు. అయితే ఈ పద్ధతివల్ల అమ్మకం విరివిగా సాగుతుంది.

అదేవిధంగా సాంఘిక దురాచారాలను పురస్కరించుకొని రష్యన్ విధానాలకు మద్దతు ఇవ్వాలను ఒక అభిప్రాయాన్ని కమ్యూనిష్టులు కలుగచేస్తున్నారు. ఒకప్పుడు నిజంగా సంఘ దురాచారమే వుండవచ్చు. ఒకప్పుడు వారు ప్రతిఘటించు విషయాలు శోచనీయంగానే వుండవచ్చు. వారు అవలంబిస్తోన్న విషయాలు మంచివే కావచ్చు. అయితే వీటికి కమ్యూనిజానికి, సోవియట్ విధానాలకి ఏమీ సంబంధం

లేదు. కాని యీ విధానం మాత్రం చాలావరకూ పని చేస్తోంది.

ఉదాహరణకు ఈ విధానం ద్వారా పాశ్చాత్య దేశాలలోగల చాలమంది కమ్యూనిజం అనేది పురోగమిస్తున్న పెద్ద విప్లవజ్వాల అని నమ్మేరు. నిజానికి ఇది పురాతన కాలపు దార్జన్యాలకు సరిసమానం. ప్రస్తుతం ఆశియా దేశ ప్రజలలో కమ్యూనిజం సామ్రాజ్య వాదానికి వ్యతిరేకమని ప్రచారం సాగుతోంది. నిజానికి కమ్యూనిజమే ఒక పెద్ద సామ్రాజ్య వాదం.

అందువల్లనే జీవిత ప్రమాణాలు హెచ్చైనంత మాత్రాన ప్రజలు కమ్యూనిజంలో నమ్మకం వుంచరనే మాట తప్పు. నేనన్నట్లు అది అంత సులభంకాదు.

ఫ్రాన్సు ఇటలీ దేశాలలో ఎక్కువ ధనికవర్గాలవారున్న జిల్లాలలోనే ఎక్కువ కమ్యూనిస్టు ఓట్లు వచ్చాయి. కాబట్టి జీవిత ప్రమాణాన్నిబట్టి మానసిక నైతిక దృష్టి అలవడదని అర్ధమైంది. అయితే పాశ్చాత్య దేశం ఆసియాకు ఆర్ధిక సహాయం చేయవద్దనికాని లేదా ఆ సహాయం అంత ప్రధానమైంది కాదని నేననడం లేదు. ఆ మాటటుంచి ఈలాటి కార్యక్రమాల ద్వారా ప్రపంచ రాజకీయాలలో ఎక్కువ అభివృద్ధి జరుగుతుందని నా అభిప్రాయం.

నేనన్నది కేవలం ప్రచ్ఛన్న యుద్ధంకోసం మాత్రమే. ఇతర దేశాలకు సహాయం చేయడంవల్ల ఏ విధమైన సత్ఫలితం కలగబోదు. ఆ విధంగా కాకుండా ఆశియా దేశ ప్రజల మేలు

కోసం సుహృద్భావంతో వారికి సహాయం చెయ్యడం మంచిది. సుహృద్భావం అన్నది సులువుగా నలుదెసలా వ్యాపిస్తుంది.

ఈ విధమైన ఆర్థిక సహాయం చాలా ముఖ్యమైనా దీనిని పురస్కరించుకొని కమ్యూనిస్టులు ఆసియా దేశమంతా ఒకవిధమైన దుష్ప్రచారం సాగించారు. పాశ్చాత్య దేశీయులు సహాయం చేసేది ధర్మసూత్రాలు కావని కేవల సాంకేతికజ్ఞానం అని దీని సారాంశం.

మనం చేసే సహాయ కార్యక్రమాలు మనకే వ్యతిరేకించేటట్లు వారు ప్రచారం చేస్తున్నారు. అనేక లాభాలను ఆశించే రష్యా చైనాకు ఆర్థిక సాయుధబలసహాయం చేస్తోంది. ఈ రోగా సామ్యవాదులు కొందరు స్వతంత్ర ఆశియా రాజ్యాలలో విరివిగా కమ్యూనిస్టు సిద్ధాంతాలను వ్యాపింపచేయడం వాటికి అనుగుణంగా ప్రజాసాహిత్యాన్ని పథకాలను పెంపొందింప చేయడానికి తమ దృష్టిని కేంద్రీకరిస్తున్నారు. ఆగ్నేయ ఆసియాలో విశ్వవిద్యాలయాలలోను సాంస్కృతిక కేంద్రాలలోను కళలమీద ముఖ్యమైన అసామాన్య విషయాలను గూర్చి రచించే గ్రంథాలు ఆ యా భాషలలోనే కాకుండా యూరపు భాషలలోనూ లభ్యమౌతున్నాయి. అటనుండే విద్యార్థులకు చౌకధరకు దొరుకుతాయి. ఇంచుమించు యీ పుస్తకాలన్నీ కూడా కమ్యూనిస్టు పుస్తకాలయాలు ప్రచురించినవే.

మానవునికి ఉదరపోషణమే ముఖ్యావధికాదు. తనను ఆపదనుండి కాపాడుకోవడానికి ఆయుధాలే ఆఖరిశరణ్యాలు కావు. ఇది ఒక నగ్నసత్యం. కాని చిత్రమేమిటంటే ప్రపంచ

జాతులమధ్య పరస్పర సంబంధబాంధవ్యాలలో ఈ నగ్న సత్యాన్ని దుర్వినియోగం చేస్తోంది పశ్చిమ ప్రజాస్వామ్య వాదం కాదు. కాని అనేక ప్రతికూలశక్తులతోను ప్రపంచాన్ని బానిసత్వంతో పాదాక్రాంతంచేయాలన్న దురుద్దేశాలతోను పైకి పొక్కనీయకుండా లోలోపలనే విధ్వంసకశక్తులను ప్రేరేపిస్తున్న భౌతికవాదులైన కమ్యూనిష్టులే.

ఆశియావాసులకు పశ్చిమదేశీయులకు గల సంబంధాలలో మన సాంకేతికవిజ్ఞానంమీదే దృష్టి కేంద్రీకరించడం యీ తరంలో వచ్చిన ఒక ముఖ్యమైన మార్పు. క్రిందటి తరంలో పశ్చిమదేశీయులు తూర్పుదేశాలలో చేసిన ఘనకార్యాలను తలచుకొంటే చప్పున కొన్ని జ్ఞాపకానికి వస్తాయి. అక్కడ జాతుల మధ్య మైత్రిని పెంపొందించడం నిద్రాముద్రితులై వెనుకబడిన ప్రజలకు మనోవికాసం కల్గించడం బడులను వైద్యశాలలను నిర్మించడం - ఇవన్నీ వారు సాధించినవే. వారి లౌకిక విషయాలలోకూడా ఇంతవఱకూ మనం సాంకేతిక జ్ఞానంపై పూర్తిగాకాని, ముఖ్యంగాకాని శ్రద్ధచూపడంలేదు. ఈ సంవత్సరం మొదటి ఏభైసంవత్సరాలనుండి ఇండియానుండి విద్యార్థులనేకులు న్యాయశాస్త్రం, చరిత్ర, వేదాంతశాస్త్రం అచ్చట విశ్వవిద్యాలయాలలో చదువుకొంటున్నారు. వీరు అందరూ చదువులు ముగిసినపిదప స్వదేశానికి తిరిగివచ్చి సాధించిన కృత్యాలే ఆ దేశానికి చరిత్రగా రూపొందింది.

ఈ రోజుకూడా ఆశియా ఆఫ్రికానుండి వచ్చిన వేల కొలది విద్యార్థులు "చతుర్థవిషయం" ప్రణాళికద్వారా, కొలంబో ప్రణాళికద్వారా, ఐక్యరాజ్యసమితిద్వారా, లభించే

వేతనాలపై అమెరికాలోను, కెనడాలోను, బ్రిటన్‌లోను ఇంకా కొన్ని పశ్చిమదేశాల్లో చదువుకొంటున్నారు. దీంట్లో చెప్పవలసిన ముఖ్యాంశం ఏమిటంటే ఇప్పుడు చాల మంది విద్యార్థులు ఇంజనీరింగ్, సాంకేతికవిజ్ఞానం మొదలైన వాటినిగురించే ఎక్కువ చదువుతున్నారు. పశ్చిమదేశాలలో వారు పొందుతున్న ఈ విద్యాభ్యాసం ఈ శిక్షణ మనం ముఖ్యంగా గమనింపదగినవి. ఈ విధమైన విద్యా కార్యక్రమాల విషయంలో పాశ్చాత్యదేశం జాతీయఅభివృద్ధికి, అంతర్జాతీయ సంబంధబాంధవ్యాలకు దోహదంకూర్చుతున్నదా ? వ్యక్తిగతంగా ఆసియాదేశానికి సుహృద్భావసంఘం ఒకటి ఉండాలని నా అభిప్రాయం.

ఉదాహరణకు విశ్వవిద్యాలయ ఉపాధ్యాయులు చరిత్ర రాజకీయాలు, వేదాంతం ముఖ్యవిషయాలుగా తీసుకొన్న విద్యార్థుల, పత్రికా విలేఖరుల, సంపాదకుల దేశాంతరంగా రాకపోకలు విరివిగా సాగాలి. పాశ్చాత్య యంత్రాలను పంపడమే కాకుండా పాశ్చాత్య నాగరికతను తీర్చి దిద్దిన మేధావంతులు వారి గ్రంథరాజాలు చౌకధరలో దొరకాలి. అంతేకాక ఆయా దేశ విషయాలనుగురించి పాశ్చాత్య విశ్వవిద్యాలయాల్లో మరింత ప్రాధాన్యం ఉండాలి. సాంస్కృతికరంగంలో ఆయా దేశాలకి సంబంధం పెంపొందడం ముఖ్యావసరం. అసలు ప్రజాభిప్రాయం సరిదిద్దేవారు చాలవఱకు తత్త్వశాస్త్రజ్ఞులు, ఉపాధ్యాయులు, గ్రంథకర్తలు.

ఈ రంగాలలో నూతన శోభతో వెలుగొందే పాశ్చాత్యదేశాలకి మధ్య రాకపోకలు రెండువైపులా ఉండాలి.

ఈ సందర్భంలో సంయుక్తరాష్ట్రాలకు లెబనీస్ రాయబారి అయిన నా మిత్రుడు చార్లెస్ మాలిక్ అన్నమాటలు నాకు బాగా నచ్చాయి.

"ఆసియా ఆఫ్రికా ఖండాలలో రాజకీయ సాంఘిక ఆర్థిక సమస్యలు మానసిక ఆధ్యాత్మిక సమస్యలకన్న చాలా నిస్సారమైనవి. ఎందువల్లనంటే ప్రజలకు స్వనిర్ణయాధికార శక్తి లేకుంటే అది నేడో రేపో వారు పొందడం చూస్తున్నాం. ప్రజలు తమ సహజసంపత్తును ఉపయోగింపలేకపోతే కొద్ది కాలంలో వారు దానికి కృషి చేస్తున్నారు. సాంఘిక దురాచారాలుంటే వాటిని ఎదుర్కొంటున్నారు. ఎంత అస్పష్టంగా కనబడినా ఈ రంగాల్లోని విషయాలు మనకు సుస్పష్టమే"

"అయితే ఆసియా ఆఫ్రికా పరమార్థం ఏ విధంగా పరిణమిస్తుంది? అదీ ప్రశ్న. ప్రజలు ఒకమారు రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించిన తర్వాత, ఒకమారు సాంఘిక ధర్మాన్ని సాధించిన పిదప, వారి ఆధ్యాత్మికశక్తి సవ్యమార్గాలలోనే పోతుందనడానికి వీలులేదు. మానవుని మనస్సు, ఆత్మ, జీవశక్తి తన ఆర్థిక సాంఘికమైన ఉనికినిబట్టి ఆధారపడి ఉంటాయి"

ఈ విషయాన్ని ముగించే ముందు కామన్‌వెల్తు రాజ్యాలు వహిస్తున్న ప్రధానపాత్రను గూర్చి ముచ్చటిస్తాను. ఇది సన్నిహిత సంబంధమైన ఒక వ్యవస్థ. ఖండాంతర దేశాలు కూడా ఇందులో సభ్యులే. అనుమానం పెనుభూతంలా ఆవరించిన ఈ యుగంలో ఆసియా ఆఫ్రికా పాశ్చాత్య దేశాల మధ్య సామరస్యం పెంపొందించడానికి ఈ వ్యవస్థ ఒక వంతెన వంటిది.

కామన్‌వెల్తు వ్యవస్థలో ఉన్న విలువకు శక్తికి ముఖ్య కారణం ఈ వ్యవస్థలో గల సభ్యత్వంయొక్క అస్పష్టతయే. ఈ వ్యవస్థ ఒక రాజకీయ తంత్రంగా పరిణమిస్తే ఈ అభివృద్ధికి స్థానముండేదికాదు. ఈ వ్యవస్థశక్తి నిజానికి సభ్యులలో గల పరస్పర గౌరవభావమే కారణం. ఈ విషయాన్ని గుర్తిస్తే అంతర్జాతీయ విషయాలలో కూడా మంచిది.

7

# ప్రజాస్వామ్యం : నిర్ణయశక్తి

"ఇంతవరకూ మన దృక్పథమే మనసులో ఉంచుకొని ప్రపంచ రాజకీయసమస్యలు నూతన పరిమాణంలో మనతరం వారికి ఏవిధంగా ఎదుర్కొనవలసివచ్చిందో ఆలోచించాం. బహిర్గతసాధనకు శక్తి ఏవిధంగా ఉపయోగించేది చూశాం. జాతీయహద్దులను మీరిన సంఘాలు వ్యవస్థలు వివిధ నాగరికతలకు గల సంబంధ బాంధవ్యాలు - వీటినిగురించి కొంత పరిశీలించాం.

అంతర్జాతీయ పరిమాణం, విస్తృతమైన విదేశాంగ విధానాన్ని నిర్ణయించేప్రజలవల్ల ఇంకా క్లిష్టతరం అవుతోంది. ఈ విధానాన్ని ప్రజాబాహుళ్యం ఓట్లద్వారా పరోక్షంగా నిర్ణయిస్తోంది. దినపత్రికలు, రేడియోలు, టెలివిజన్లు వీటిద్వారా ప్రజల అజ్ఞానాంధకారాన్ని అభివృద్ధిపరచేవారిసంఖ్య ఎక్కువైపోయింది. దినదినమూ జరిగే నిర్ణయాలలో వ్యక్తిగత సభ్యుడు లేదా సంఘసభ్యులు జోక్యం కల్గించుకోవడం మితి మీరింది.

ఈ విషయాన్ని రాజకీయ నీతిమార్గాలను వివరించేటపుడు నేను కొంత ముచ్చటించాను. రాజకీయవిధానాన్ని

సరిదిద్దేవిషయంలో ఒకటి రెండు మాటలు చెప్పదలచు కొన్నాను.

విదేశాంగవిధానంలో ప్రజలుపాల్గొనడం ప్రజాస్వామ్య పద్ధతిలోనే మిళితమై ఉంది. అది ఆ విధంగానే ఉండాలి. ప్రస్తుత స్వేచ్ఛా ప్రజాస్వామిక దేశాలలో విదేశాంగవిధాన మనేది అందరి పౌరులను సంరక్షించి వారి ఆత్మీయతను భద్ర పరచడమే కాక ఆ విధానంలో గల సూత్రాలకు ప్రజామోదం, ఆవశ్యకత ఉన్నాయి. ఇటీవలవఱకు పాశ్చాత్యసంఘాలలో కూడా ఈ రంగంలో నిర్ణయాలను ఒక వ్యక్తికాని పరిపాలించేవ్యక్తులుకాని తీసుకోవడం మామూలు అయి పోయింది. కొన్నిసందర్భాలలో యీ విధానాలు ఆ వ్యక్తులకు మాత్రమే లాభకరంగా ఉండేవి. ఇప్పటి పరిస్థితి వేరు. ఇప్పుడు మన కందరకు సంబంధించిన విషయం అయింది. మనమే పరి పాలకులం. మనమే సేవకులం. మనమే నిపుణులంకూడా.

విదేశాంగవిధాన నిర్వహణలో ప్రజలజోక్యంవలన కలిగిన మానసిక భావనాచైతన్యంవల్ల కలిగిన భయాలకు గురి అయినవాళ్ళున్నారు. వారు ఈ జోక్యంవలన కలిగే విద్వేషాలను గూర్చి తెలివితక్కువ ఉద్దేశాలనుగూర్చి ఫిర్యాదు చేస్తున్నారు. అయితే అదివరకుకాలంలో రాచరికం చెలామణీ అయ్యేరోజుల్లోకూడా ఈ స్వార్థపూరితమైన అవినీతికరమైన దుష్ప్రభావాలు లేకపోలేదు. ఉదాహరణకు రాజుగారి ఇష్ట సఖులు, విదూషకులు, ప్రజ్ఞావంతమైన నిర్ణయాలకు ఆటంక పరచి బాగా ఆలోచించి చేసిన విదేశాంగవిధానాన్ని తారు మారు చేసి ఉండేవారని నా అనుమానం. [illegible]గా ఈ

రోజుల్లో ప్రజాభిప్రాయం విదేశాంగవిధానాల్ని మార్చవచ్చు. పూర్వకాలంలో అలాటి అంతరాయాలను అరికట్టడానికి ప్రజ్ఞా దురంధరులైన మంత్రుల ప్రతిచర్యలు సుకరంగాను ఫలవంతంగాను ఉండేవి. ఈ రోజుల్లో రాష్ట్రకార్యదర్శికాని, విదేశాంగ మంత్రికాని ఒక పత్రికావిలేఖరుడైన లేదా ఒక రేడియో విమర్శకునిపైన ఒక లెజస్లేటివ్ ఉపసంఘంపైనకూడా ఆ అధికారం చెలాయించలేరు.

విదేశాంగవిధానం అమలు పరచడంలో ప్రజాస్వామ్యం రకరకాలుగా జోక్యం కలుగచేసుకోవచ్చు. ఏకచ్ఛత్రాధిపత్యం ఉన్న రాజ్యాలలో కూడా నీచకరమైన కుట్రలు లేకపోలేదు. మాస్కోయే దీనికి సాక్ష్యం. లెజస్లేటివ్ సంఘాభిప్రాయాలకు భిన్నంగా ప్రవర్తించే రాష్ట్ర కార్యదర్శి గౌరవ మర్యాదలకు అధికారానికి భంగం వాటిల్లుతుంది. అయితే నియంతృత్వ ప్రభుత్వాలలో నియంతలను వ్యతిరేక ప్రవర్తనలవల్ల విదేశాంగమంత్రి (కమీషనర్) కి అంతకంటె ఎక్కువ హానియే కలుగుతుంది.

ఈ ఆందోళన ఎంత అర్థరహితమైనదే అయినా ఈ లక్షలాది ప్రజలు మనోభావాలు దృక్పథాలు విధానాలను ఏర్పరచడంలో ప్రముఖపాత్రను వహిస్తాయి.

అంతిమ అధికారం హస్తగతం చేసుకొన్న ప్రజానీకం కఠిన నిర్ణయాలను తీసుకునే బాధ్యత చూపించలేదని, అట్టి నిర్ణయాలు తీసుకొన్నప్పుడు ఆ నిర్ణయాలు అవకాశపూరితంగా ఉంటాయి. కాని ప్రజ్ఞావిశేషంతో కూడిందికాదని కొందరి

వాదన. ప్రజాస్వామ్యం లోటు ఈ విషయంలో చరిత్రలో బాగా కన్పిస్తున్నాయి.

రెండు వేల మూడువందల సంవత్సరాలక్రితం గ్రీకు ప్రజాస్వామ్యంలో ప్రజలకు నాయకులకు మధ్య సన్నిహిత సంబంధబాంధవ్యాలున్నాయి. ఇట్టి సంబంధాన్ని పెంపొందించడానికి టెలివిజన్ సహాయభూతంగా ఉంది. అయితే ఫలితాలు మాత్రం అనుమానాస్పదంగా, ఉన్నాయి. పూర్వకాలంవలె ఈ కాలంలోకూడా ఇట్టి సన్నిహిత సంబంధాలవల్ల దృఢ విశ్వాసాల్లో ఏమాత్రం మార్పు రాలేదు. మెసడోనియన్ రాజైన ఫిలిప్పువల్ల కలిగే ఉపద్రవాన్నిగురించి ఎథీనియన్ ఎసంబ్లీలో డెమాస్తనీస్ ఎంత వాదించినా నిష్ఫలమైంది. అదే విధంగా నాజీల ఉపద్రవాన్నిగురించి 1930 లో బ్రిటిష్ పార్లమెంటులో చర్చిల్ ప్రయత్నాలు సఫలం కాలేదు.

క్రీ. పూ. 427 లో క్లియాన్ అనేవాడు వారి ఎసంబ్లీలో ఈ విధంగా చెప్పాడు. "ప్రజాస్వామ్యమనేది సామ్రాజ్యతత్వాన్ని నిలుపుకోలేదు". ఈ అసమర్థతకు కారణం క్లియాన్ చెప్పినట్లు ఇతరులు తమవంటివారు కాదన్నసంగతి ఎసంబ్లీ సభ్యులు మరచిపోతున్నారు. "అధికారం లేని మంచి నిబంధనలకన్న మార్పులేని చెడ్డ నిబంధనలే మంచి"వను విషయం ప్రజలు మరువరాదు.

"నిజంగా ఈ విషయంలో మీరే నేరస్థులు. మీరే ఈ వాదోపవాదపద్ధతిని ఏర్పాటు చేయడం తెలివితక్కువ. ఒక సుందరదృశ్యాన్ని తిలకించినట్లు ఒక ప్రసంగాన్ని చూస్తారు. వదంతులు వాస్తవ విషయాలుగా భావిస్తారు. కార్యాచరణకు

ఒక విషయం అనుకూలంగా ఉన్నదా లేదా అన్నదాన్ని వాదించేవారి బుద్ధిచాతుర్యాన్ని బట్టి నిర్ణయిస్తారు. గతించిన సంఘటనలలోని సత్యాన్ని కళ్ళారా చూడకుండా వీనులారా విని నమ్ముతారు."

ఈ మాటలు ఈ నాటివి లాగె ధ్వనిస్తున్నాయి. అయితే రాజకీయవేత్తలు మాత్రం ఆ విధంగా మాట్లాడరు. 26 శతాబ్దాల క్రితం వాల్టర్ లిప్‌మెన్ ప్రభుత్వవిధాన విజ్ఞేత లకు గల నిర్ణయావకాశాలు గూర్చి ప్రస్తావిస్తూ ఈ విధంగా తేల్చి చెప్పాడు.

"క్లిష్ట సాధ్యమైన లేక సులభసాధ్యమైన విషయాలు నిర్ణయించడానికి ప్రజాస్వామ్య ప్రభుత్వాలు సర్వసామా న్యంగా అధిక సంఖ్యాకులను సంతోషపెట్టడానికి చూస్తుంది."

దీనిని పురస్కరించుకొని వాల్టర్ లిప్‌మెన్ ఒక నిరాశా జనకమైన నిర్ణయానికి వచ్చాడు. ప్రజలకు సమంజసమని తోచే లోపుగా ప్రజాస్వామిక రాజకీయవేత్త ఒక విషయాన్ని తప్పుగా పరిగణించడం శ్రేయస్కరమే. సంఘటనలతో పాటు ప్రవర్తించడంకంటె ప్రజాభిప్రాయాలకు అనుకూలంగా పోవడం మంచిది.

దీనికి కారణం లిప్‌మెన్ ఉద్దేశంలో ప్రభుత్వంపై ప్రజాభిప్రాయం తెచ్చుకొన్న ఒత్తిడియే.

అతనిఉద్దేశంలో "వాదప్రతివాదాలు జరిపేవారి సంఖ్య పెరుగుతున్న కొద్దీ ప్రజాభిప్రాయం వాస్తవానికి దూరం అవు తుంది" ఇదే చాలావరకు పరస్పర విరుద్ధమైన పలువిధాలైన ఒత్తిడికి కారణం అని ఆయనభావం. కాలక్రమంలో ఇది

భరించరానిదై అంతరిస్తుంది. లిప్‌మెన్ ప్రకారం "ప్రజాభిప్రాయం పెత్తనం వహించినపుడు అధికార నిజధర్మం సర్వనాశన మౌతుంది."

ఈ విధమైన అపాయం ఉందని చెప్పడానికి వాల్టర్ లిప్‌మెన్ చెప్పిన విషయాలన్నింటితోను ఏకీభవించ నక్కర లేదు. ఈవిధాన నిర్ణయ పద్ధతిలో బాధ్యతా పూరితమైన నిగ్రహశక్తి లేకపోతే మానసిక నైతిక దౌర్బల్యానికి లోనై పెద్ద సంఘాలు అంతర్గత కారణాలవల్లకాని బహిర్గత కారణాలవల్లకాని నశించి పోతాయి.

ఈ అపాయాన్ని అర్థం చేసుకోడానికి గడచిన ఏబది ఏండ్లలో అంతర్జాతీయ రాజకీయాలను గూర్చిన ఒకటి రెండు ముఖ్యాంశాలను చూస్తే చాలు. ఏదైనా ఒక విషయం నేర్చుకోవాలన్న తప్పుఒప్పుల పద్ధతి ఒకటి. దీనిలో చాలా అనుభవం వుంది. అనుభవం బుద్ధివికాసానికి సంబంధపడితే మంచిదే. కాని అట్టి వికాసం కలుగుతుందని నమ్మకం లేదు. యీ సందర్భంలో నెపోలియన్ జీవితంలో ఒక విశేషం ఉదహరిస్తాను. చాలా దండయాత్రలలో అనుభవం వున్న ఒక సైన్యాధికారిని ఉన్నత పదవికి సిఫార్సుచేయమని కోరగా నెపోలియన్ ఇచ్చిన సమాధాన మిది: "నా గుఱ్ఱానికి ఎక్కువ అనుభవమే వుంది". ఇదే విధంగా సైన్యాధికారులతో ముచ్చటిస్తూ ఘనుడైన ఫ్రెడరిక్ యీ విధంగా అన్నాడు. "మీ అనుభవాన్నిగూర్చి తీవ్రంగా ఆలోచించనప్పుడు దానివలన ప్రయోజనం ఏమిటి ?".

మన అనుభవంవల్ల ఉపయోగం వుండాలంటే ఆ అను భవాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవడం మొదటిమెట్టు. అలాంటి ఒక విషయాన్ని గూర్చి ప్రస్తావిస్తాను.

30 సంవత్సరాల క్రితం సంయుక్త రాష్ట్రాలలో చాలా మంది ప్రజల ఆలోచన నూతిలో కప్ప విధంగా వుండేది. యూరపులో జరిగే సంఘటనలగూర్చి అమెరికాలో అధిక సంఖ్యాకులు ఏమీ ఆలోచించేవారు కాదు. ఒకానొక కాలంలో ఆ ప్రజల విషయాలలో వీళ్ళవిధి నిర్ణయం కూడా ఇమిడి వుంటుందని వాళ్ళకు తెలియదు.

కెనడా దేశస్థులు వారి చరిత్ర సాంప్రదాయాలు బట్టి యూరప్ విషయాలలో ఈ విధంగా ఎప్పుడూ లేరు. 1914, 1939 లో కెనడా యుద్ధంలో ప్రవేశించడానికి ఈ ప్రవర్తనయే కారణం. అయినా యూరప్‌లో జరిగిన సంఘటనలతో తమకు ఏవిధమైన సంబంధంలేదని తలపోసే అమెరికన్లవలె చాలమంది కెనడా దేశస్థులున్నారు.

1920, 1930 దశాబ్దాలలో యూరప్ పరిస్థితుల్లో కెనడావారు జోక్యం కలిగించుకోకుండా ఉండానికి వేరొక ఉద్దేశం ఉంది. యూరప్‌లో జరిగిన సంఘటనలు అక్రమమూ సక్రమమూ అనే విషయాలపైన కెనడా ప్రజలకు తీవ్ర అభి ప్రాయభేదాలే ఉన్నాయి. కొంతమంది కెనడియన్లు పెక్కు మంది అమెరికన్లవలె మధ్యకల సముద్రాలే తమకు భద్రతను ఇస్తాయని తృప్తికరమైన భ్రాంతిలో ఉండేవారు. అయితే 1930 లో కెనడా ప్రభుత్వం యూరప్‌కు సంబంధించిన విషయా లలో గాని లేదా మిత్రరాజ్యసమితిలో గాని జోక్యం కలిగించుకో

లేదు. దీనివలన యుద్ధపరిస్థితిలో తాము క్షేమకరంగా ఉండ వచ్చును అని కాదు. రాజకీయ విషయాలలో ఎలాటి అభి ప్రాయాలు వెలిబుచ్చినా కెనడా దేశంలో రాజకీయసమస్యలు అపరిమితం అవుతాయని వారి భావం.

ద్వితీయ ప్రపంచసంగ్రామానికి పూర్వం ప్రపంచ రాజ కీయాలలో ఉత్తరఅమెరికా ఏమీ జోక్యం కల్గించుకోలేదు. దీనికికారణం శాంతిభద్రతలనుగూర్చిన తప్పుడు అభిప్రాయా లైనా కావచ్చు; లేదా అభిప్రాయభేదాలలోగల తీవ్రతైనా కావచ్చు. ఇదేవిధంగా యూరప్‌లోగల ప్రజాస్వామ్యాలు కూడా ప్రవర్తించాయి. ఆ ప్రజాస్వామ్యాలకు అపాయం సన్నిహితమైనా దానిని చూడ నిరాకరించారు. చాల దేశా లలో ఈ ఉదాసీనతకు కారణం ఇచ్ఛాశక్తి దౌర్బల్యమే. అజ్ఞానం కొంతవఱకు కారణమై ఉండవచ్చు. కాని ముఖ్య కారణంమాత్రం నైతిక అంధత్వం. కొన్నిసమయాల్లో క్లిష్ట సమస్యలను అవసరమైనప్పుడు ఎదుర్కొనడమే మంచిదని వారికి తెలియకపోలేదు. కాని వారి బాధ్యతలకు త్యాగానికికావలసిన కార్యాచరణనుమాత్రం చూపించడానికి నిరాకరించారు.

1930 లో పాశ్చాత్య ప్రజాస్వామ్యాలు ఒక హీన దశకు వచ్చినాయి. రాజకీయ వ్యవస్థలతోగాని రాజకీయ నైపుణ్యంతోగాని ఈ హీనదశకు ఏమీ సంబంధంలేదు. ఈ దశ ఒకవిధంగా సంఘాల నైతిక నిస్సారాన్ని తెలుపుతోంది.

అలాటి సందర్భంలో క్రూరమైన విమోచనాత్మకమైన అనుభూతి కలిగింది. 1930 అనంతరం సంఘ ముఖ్యోద్దేశాన్ని గూర్చిన మానసికాభివృద్ధి ప్రభుత్వాలకు బాగా తెలిసింది.

ప లక్ష్యమైతే భౌతికంగా సాధ్యమౌతుందో అది రాజకీయంగా ఆర్థికంగా కూడా సాధించవచ్చునని కనుక్కోవడం జరిగింది.

ప్రజాస్వామ్య సంఘాలలో గల ఈ జాడ్యాన్ని జ్ఞప్తికి తెచ్చుకోడంలో నా ముఖ్యోద్దేశం ప్రజాస్వామ్యం సర్వవేళల మంచి నిర్ణయాలే చేస్తుందని చెప్పలేమని ఋజువుచెయ్యడమే. అంతేకాదు. ప్రజాస్వామ్య సంఘాలలో చాలమంది ప్రజలు తమ ప్రమాణాలను మరచిపోయినపుడు ఈ జాడ్యం ఎంత త్వరగా వ్యాపిస్తుందో కూడా దీనివల్ల తెలుస్తోంది.

అంతేకాదు. ప్రస్తుత నిరాశాపూరిత పరిస్థితుల్లో ఒకానొకప్పుడు మనం పురోభివృద్ధి చెందేమని తెలుసుకోవడం మంచిదే.

లిప్‌మెన్ పేర్కొన్న నిర్ణయశక్తిలేమి, వాస్తవికతను ఎదుర్కోవడం, కఠోర నిర్ణయాలు చేయడం అనే జాడ్యాలు ప్రజాస్వామ్యపద్ధతికి నైజాలుకావు. వ్యక్తుల అంతర్గత శక్తుల బలహీనతయే దీనికి కారణం. స్వార్థపూరితమనస్కులై రాజకీయ బాధ్యతాయుత రహితమైన వ్యక్తులవల్ల ఈ జాడ్యాలు ప సంఘంలోనైనా ప్రవేశిస్తాయి.

ప్రాతినిధ్యంగల ప్రజాస్వామ్యానికి తదితర రాజకీయ సంఘాలకు ముఖ్యభేదం ప్రజాస్వామ్యంలో ప్రతి పౌరుడు నిర్ణయాలపై ప్రభావం చూపగలడు. పెక్కు ప్రజల మానసిక దృష్టి రాజకీయ సంఘటనలో వెంటనే ఫలాన్ని యిస్తుంది. అధిక సంఖ్యాకుల నైతికస్థాయి మహోన్నతమైనపుడు యివి బలాన్ని చేకూరుస్తాయి. దీనివలన సంఘంలో అధములను అధికారంలోంచి తొలగించడం సులభం. తదితర నియంతృత్వ

సంఘాలలో కొద్దిమంది వ్యక్తుల మానసిక నైతిక దౌర్బల్యం వలన పెద్ద సామ్రాజ్యాలే 1917 లో "జారిష్టు రష్యా" వలె ఛిన్నాభిన్నమై పోతుంది.

ప్రజాస్వామ్యవిధానం తదితర రాజకీయ సంఘాలకన్న ఈ రాజకీయ జాడ్యానికి లోనవడానికి తక్కువ అవకాశాలే ఉన్నాయి. పూర్వకాలంలో రాజు కొలువులోగల ప్రభుత్వాధికారులవలెనే ఈ నాడు ప్రజానాయకులున్నారు. ఈ రోజున ఏ ప్రజా నాయకుడైనా ఎక్కువ ప్రజలతో సంపర్కం కలిగినా విధానాలలో మాత్రం తన ప్రతిభ పూర్వకాలంలోవలె చూపలేడు. నిరంకుశుని చెవుల్లో గుసగుసలాడడంకంటె 'మైక్రొఫోన్'లో గర్జించడంవల్ల అంత ప్రయోజనం లేదు.

పూర్వకాలంలో రాజులకు నిజమైన విషయాలను తెల్పక వారి మనోభీష్టానికి అనుగుణంగా వున్న విషయాలనే ప్రభుత్వాధికారులు తెలుపుచుండెడివారు. దీనివలన రాజు మిథ్యాచారానికి గురి అయ్యేడివాడు. అదేవిధంగా అధికారాన్ని వాంఛించిన కొందరు నేడు ప్రజాస్వామ్యాలలోకూడా ప్రజల విషయంపట్ల అదే మిథ్యాచారం అవలంబిస్తున్నారు.

యీ జాడ్యం రాజకీయ ఉపన్యాసాల లోనేకాదు. ప్రభుత్వాధికారం తాము నిజంగా విశ్వసించినట్లు వారి అభిప్రాయాలను వెలిబుచ్చకుండ ప్రజాభిప్రాయానికి అనుగుణంగా స్వయం నిర్ణయాధికార శక్తులను వినియోగించకుండ ప్రవర్తిస్తే యీ జాడ్యం విదేశాంగ వ్యవహారాలలోనేమి దేశాంగ వ్యవహారాలలోనేమి ఏ ప్రభుత్వ వ్యవస్థలలోనేమి ఏ వ్యాపారంలోనేమి వ్యాపింపక తప్పదు.

ఇలాంటి సమస్యను నిజాయితీ, బలం, నైతిక స్థైర్యంగల ప్రతి మానవుడు ఎదుర్కొన వలసిందే. దేశ క్షేమానికి భిన్నంగా ఏ ప్రజాసేవకుడు కాని తన నిర్ణయాన్ని చేయాలని ప్రజాస్వామ్య సిద్ధాంతాలలో కాని కార్యాచరణలో కాని లేదు.

రాజకీయాలు "సాధన గూర్చిన కళ" అని నిర్వచించడం బాగానేవుంది. ఏ నిర్ణయాన్ని తీసుకొనడానికి ముందైనా ప్రతి రాజకీయ వేత్త ప్రజల సమ్మతినిబట్టి నిర్ణయించడం సమంజసమే. అది వుపయోగకరం కూడా. కాని తాను సాధింపవలసిన కార్యానికి సరియైన కాలం సాధన రకరకాలుగా వుండవచ్చు. అయితే దేశ క్షేమానికి వ్యతిరేకంగా మాత్రం పోరాదు. అట్లా పోతే దేశద్రోహం అవుతుంది.

బాధ్యతాయుత ప్రభుత్వమే ప్రజాస్వామ్యపు ముఖ్య రాజకీయ సూత్రం. ప్రభుత్వ పద్ధతి తమ కంగీకారం కాక పోతే ఆ ప్రభుత్వాన్ని తొలగించడానికి ఆ ఎన్నుకొన్న వారికి అధికారం వుంది. అయితే దీని అర్థం అధిక సంఖ్యాకుల అభిప్రాయాలు సర్వత్రా సక్రమంగానే వుంటాయని కాదు. వంటకం బాగోగులను నిర్ణయించేవాడు వంటవాడు కాదు. విందారగించేవాడు.

నే నెఱిగినంతవఱకు మునిసిపల్ సలభలలోనే తప్ప ఏ ప్రభుత్వమూ అధిక సంఖ్యాకుల అభిప్రాయాలకు నడవాలని లేదు. ప్రభుత్వ బాధ్యత లెజస్లేచర్ విశ్వాసాన్ని సంపాదించడమే. అధిక సంఖ్యాకుల నిరంతరమైన జోక్యం ప్రతి ప్రభుత్వానికి ఆటంకమే. అయితే ప్రభుత్వాలకు సర్వవేళల ప్రజో

ప్రదేశానికి అనుగుణంగాగాని ప్రజాబాహుళ్యపు వాంఛికి లొంగియుండవలసిన రాజకీయావసరం గాని లేదు.

ప్రజాస్వామ్యపు టున్నతసేవకుడు ఎడ్మండ్ బర్క్ అని నా అభిప్రాయం. బ్రిష్టల్‌లో గిల్డుహాలునందు వ్యక్తిగత సమస్యలపై తన అభిప్రాయాన్ని వెలిబుచ్చమని పీడించగా ఎడ్మండ్ బర్క్ అన్నమాటలు జ్ఞప్తికి తెచ్చుకోవడం మంచిది.

"నేను మీ నిబంధనాలను పాటించలేదు. ముమ్మాటికీ లేదు. సత్యం, ప్రకృతి నాకు బోధించిన నిబంధనాలని అనుసరించాను. మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా మీ క్షేమాలకి అనుగుణంగా ప్రవర్తించాను. ఈ అలవాటు నాలో జీర్ణించిపోయింది. యోగ్యుడైన ప్రతినిధి స్థిరచిత్తుడై యుండాలి. మీ అభిప్రాయాలను నేను తెలుసుకోవలసిందే. అయితే మీరూ నేనూ భవిష్యత్తులో వెలిబుచ్చే అభిప్రాయాలనుకూడా తెలుసుకోవాలి. ఈ రోజు తళుకుబెళుకులు చూడకూడదు. రాష్ట్రానికి జీవగఱ్ఱలాగ ఉండాలని నన్ను మీరు ఎన్నుకొన్నారు. అంతేగాని గాలిపాటు తెలిపే యంత్రాన్ని అని మీ అభిప్రాయం కాదు."

ఆ సంగతి 1780 లో జరిగింది. అంతకు ఆరు సంవత్సరాలకు ముందే పార్లమెంటు సభ్యునికి ఉండవలసిన విధినిగూర్చి బర్క్ ఈ విధంగా అన్నాడు.

"...ఎన్నుకొనబడిన ప్రతినిధి ఎన్నుకొన్నవారితో సమైక్యత, చనువుతోగూడిన ఉత్తరప్రత్యుత్తరాలు, స్వేచ్ఛాయుతమైన రాకపోకలు గలిగి ఉండడం ఆనందదాయకంగాను సౌభాగ్యవంతంగాను ఉంటుంది. వారి కాంక్షలు మన్నింప

దగినవే. వారి అభిప్రాయాలు గౌరవింపదగినవే. వారి వ్యవహారాలు శ్రద్ధతో పరిశీలింపవలసినవే. వారి స్వలాభం కోసం తన సౌఖ్యాన్ని, తన ప్రశాంతిని, తన ఆనందాన్ని, భోగాలని బలి చేయవలసిందే. అయితే అతని నిష్పాక్షికమైన అభిప్రాయాన్ని, ఉత్తమమైన తీర్పును, జ్ఞానోదయమైన అంతరాత్మను మీ కోఅకుగాని ఏ మానవుని కోఅకుగాని త్యజింపరాదు. ఇవి మీ సౌఖ్యాలవల్ల వచ్చినవి కావు. రాజ్యాంగచట్టం న్యాయ సూత్రాలవల్ల వచ్చినవికావు. అవి భగవత్ప్రసాదాలు. వాటి నిరాకరణకు తానే బాధ్యుడై యుండాలి. మీ ప్రతినిధి తన కృషినే కాక తన సునిశితబుద్ధినికూడా మీకై వినియోగించాలి. అలాగచేయక మీ అభిప్రాయాలకు మీకు సేవచేయక పోతే అది ఒక ద్రోహమే"

ఎన్నుకొనువారి ఏజంట్లుగాను ఒక ప్రదేశపు విద్వేషాలను గూర్చికాని లాభనష్టాలుగూర్చికాని వాదించువానిగా మాత్రమే లెజస్లేచర్ ప్రతినిధి ఉండాలన్న సిద్ధాంతంతో బర్క్ ఏకీభవించడు. తన ఓటర్లతో నిస్సందేహంగా ఇలాగ అన్నాడు:

"పార్లమెంటు అనునది ఒక దేశానికి సంబంధించిన ఒక క్షేమాన్నిగూర్చిన వాదోపవాదాలు జరిపే మహాసభ. స్థానికోద్దేశాలు స్థానికవిద్వేషాలు ఈ మహాసభను నడిపించకూడదు. సకల దేశక్షేమానికి మాత్రమే కృషి చెయ్యాలి. మీరొక సభ్యుని ఎన్నుకొంటున్నారు. నిజమే. కాని మీరు ఎన్నుకొన్న తర్వాత అతడు బ్రిష్టల్‌కు సంబంధించిన సభ్యుడే కాదు. ప్రప్రథమమున అతడు పార్లమెంటు సభ్యుడు. స్థానిక ఓటర్లు ఎటువంటి స్వలాభంతోనైనా లేదా ప్రజాక్షేమానికి

భంగకరమైన ఏ అభిప్రాయాన్ని వెలిబుచ్చినా ఆ సభ్యుడు దానికి విలువ యివ్వడానికి ప్రయత్నించకూడదు.

1955 లో ఇది ఒక ఆదర్శమైన సలహాగా కనిపించ వచ్చు. ఏ ప్రజాస్వామ్య రాజకీయ సంఘ శ్రేయస్సుకైనా అత్యంత అవస్యకమైన సలహాను బర్క్ ఇచ్చాడు ఆ సలహాలో ముఖ్యవిషయం రాజకీయ స్వరూపంకాని నిర్మాణం కాని కాదు. అది కేవలం వ్యక్తుల శీలానికి సంబంధించినది. ఈ సలహానే మరోవిధంగా ఒక అమెరికన్ ఇలాగన్నాడు. "అధ్యతుపదవికన్న న్యాయమే నాకు ముఖ్యం".

వ్యక్తిశీలావశ్యకతను గూర్చి ఉద్ఘాటించినంత మాత్రాన రాజకీయ వ్యవస్థలకు గల విలువను హీనపరచడం లేదు. ఈ వ్యవస్థల ముఖ్యమైన విలువలలో ఒకటి – గతానుభవంలోని రాజకీయ పరిజ్ఞానాన్ని ఘనీభవింపజేసి ప్రతి రూపు ఇవ్వడం – ఆ విధంగా రాబోయే యుగాలవారికి ఆ భూతకాలంలోని విజ్ఞానాన్ని నిగ్రహశక్తిని శీలాన్ని ఆమోదింపజేయడం.

మిగతా ప్రజాస్వామ్యాలతో పోల్చి చూచినా కెనడా దేశపు మా రాచరికపు పద్ధతిలో ఒక లాభముందని నా వ్యక్తి గతాభిప్రాయం. పరిపాలించని రాష్ట్రాధిపతిగా మహారాజూ పరిపాలించే ప్రభుత్వాధిపతిగా ప్రధానమంత్రి ఉండడంవల్ల ప్రభుత్వ రాజకీవికి కొన్ని ప్రత్యేక ప్రభుత్వాల కార్యకలాపాల లోటుపాట్లకు గల తారతమ్యాన్ని ప్రజలు సులభంగా గ్రహి స్తారు. ఈ రాచరకమన్నది ప్రాతినిధ్యం ఇచ్చి ప్రత్యతుంగా మన కండ్లయెదుట కనబడేటట్లు చేస్తుంది. ప్రజలను భూత భవిష్యద్వర్తమానాల నిరంతరాన్వయాన్ని సూచిస్తుంది.

రాష్ట్రానికి సేవచేసేటప్పుడు ఒక మహోన్నతమైన ఆశయాన్ని స్ఫురింపజేస్తుంది.

లెజిస్లేచర్ సభ్యులు దాని బాధ్యత వహించిన వారై యుండి ఆ సభ్యులతో కూడిన మంత్రాంగం వుండే మా పార్లమెంటు విధానంలో అమెరికన్ కాంగ్రెస్ పద్ధతికంటె పెక్కు ప్రయోజనా లున్నాయని నా వుద్దేశం. అయితే నాది పాక్షికాభిప్రాయమై యుండవచ్చు. బాధ్యతాయుతమైన ప్రభుత్వ పార్లమెంటరీ విధానంలో మంత్రాంగం ఎప్పటికప్పుడు ఎన్నికల సంక్షోభంలో ఎదురీదడంవల్ల లెజిస్లేచర్‌కు సన్నిహిత సంబంధం వుంటుంది. ఎన్నుకోనబడిన మంత్రులకు లెజిస్లేచర్‌తో ఎట్టి సంబంధం వుండదు.

ఈ పద్ధతిలో ఇంకొక విశేషంకూడా వుంది. ప్రభుత్వం విశ్వాసరాహిత్య తీర్మానంవలన ఓటమి పొందినప్పుడు పార్లమెంటు అంతర్ధానం అవుతుంది. దీనివలన పార్లమెంటు వ్యక్తిగత సభ్యుడు రాజకీయ పక్షాల సమైక్యతకే ప్రాధాన్యమిచ్చి ప్రత్యేక స్థానిక స్వలాభానికై ప్రాకులాడడు. అధిక సంఖ్యాకులతో గూడిన తనతోడి సభ్యులతోబాటు ఏక్షణాన్ని అయినా ప్రభుత్వాన్ని కూలద్రోసే అధికారం అతనియందే వుంది. అయితే దానివలన తిరిగి ఎన్నికలు తప్పవు.

ఈవిధంగా సంయుక్త రాష్ట్రాల కాంగ్రెసు సభ్యుల కంటె కెనడా దేశపు లేదా బ్రిటిష్ దేశపు సభ్యులకు ఎక్కువ రాజకీయ అధికారం వున్నదని చెప్పవచ్చు. సంయుక్త రాష్ట్రాల కాంగ్రెసు సభ్యులు నేరారోపణంచేసి కఠినచర్య తీసుకుంటే నే తప్ప ప్రభుత్వాధికారులను తొలగించడానికి వీలు

లేదు. మా పార్లమెంటరీ విధానంలో వ్యక్తిగత లెజస్లేచర్లు రాజకీయపక్ష సమైక్యతకు ఒక శ్రేయస్కరమైన గౌరవాన్ని చూపుతారు. ఎందుచేతనంటే దీనికి భిన్నంగా ప్రవర్తిస్తే వ్యక్తిగతంగాను రాజకీయంగాను సందేహాస్పదమైన ఫలితాలతో గూడిన ఎన్నికలు కలుగు అవకాశమే. దీనివలన ప్రభుత్వాధికారులకు అధికారం ఎక్కువ. మితిమీరిన అధికారం వస్తుందని కొందరి వాదన. నా ఉద్దేశంలో లెజస్లేచరుకి ప్రభుత్వాధికారుల అధికారానికి ఇది ఒక రక్ష.

స్వరూప స్వభావాలలోని మంచి ఎలాగున్నా గతించిన 30 సంవత్సరాల అనుభవంవల్ల ఒకవిషయం తేలుతోంది. అన్నిరకాల ప్రజాస్వామ్యాలు తమబాధ్యతలను గుర్తింపక పరిస్థితులకు అవసరమైన కఠిన నిర్ణయాలను చేయ నిరాకరించాయి. అయితే 1957 మొదలు ప్రజాస్వామ్యాలలో చాలభాగం – అందులోనూ ముఖ్యంగా మహాశక్తివంతమైన అమెరికా సంయుక్తరాష్ట్రాలు బాధ్యతలను స్వీకరించి భారాలను వహించాయి.

ఒక ముఖ్యవిషయాన్ని అవగాహన చేసుకోవలసి ఉంటుంది ప్రపంచ రాజకీయాల్లో ప్రజాస్వామ్యాలకు కొన్ని విషయాలు చాలాముఖ్యం యీ విషయాలు బాహ్య పరిస్థితుల మీదగాని రాజకీయ చతురతా విధానముల మీదగాని రాజకీయ పద్ధతుల మీదగాని ఆధారపడి ఉండదు. అవి సంఘం వాతావరణం, శీలం, నైతికాధారం అన్నవి. ప్రపంచ రాజకీయాల్లో మన భవిష్యత్తు మనమీదే ఆధారపడి ఉంటుంది అనడం చాలా తెలివితక్కువ. మనం

ఒంటరిగా లేం. మన భావివిదేశాంగవిధానంలోగాని, తద్ఘతర విషయాలలోగాని మన ప్రజల గుణగణాలమీద మన రాజకీయోద్దేశాలమీద మన ఉన్నతాదర్శాలమీద ఆధారపడి ఉన్నాయి.

ప్రభుత్వవిధానాలను పద్ధతులను పరిశీలించినకొద్దీ "చారిత్రాత్మక విధి నిర్ణయ సిద్ధాంతము"ను ప్రతిపాదించ లేదా సమర్థించువిజ్ఞానవంతులైన గంభీరులైన మానవులుండడం నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. ఆ సిద్ధాంతానుసారం మనం విధిచేతులో కేవలం ఆటవస్తువులం – బానిసలం. అలాటి దృక్పథం మానవులలో నైతికశక్తి నశించినపుడు సత్యమే కావచ్చు.

విధి నిర్ణయసిద్ధాంతాలకు ముఖ్యసారం అలాటి లొంగుబాటే. దీనివలన మనకచీకటియే కాదు. కటికచీకటి ప్రాప్తిస్తుంది. జీవితానికి చరిత్రకి రాజకీయాలకి జీవనాధారమైన విషయం వ్యక్తులకు దేశాలకు హస్తగతమై ఉంది. అయితే దానిని వారు ఎప్పుడూ ఉపయోగించరు. అది ఏమంటే పరిస్థితులకు ప్రతిక్రియకంటె సృజనాత్మకమైన కార్యాచరణలో నిమగ్నులైయుండడం. సర్వసామాన్యంగా మానవులు గతించిన అనుభవాలను దృష్టిలోపెట్టుకొని లేదా బాహ్యావిషయాలలో ప్రతిక్రియరూపంలోగాని వారి కార్యాలను నిర్వహిస్తారు. అయితే మానవులు ఇంతకంటె ఉన్నతస్థాయిలోనే కార్యాలను నడపవచ్చు. పరిస్థితులనే మార్చగల శక్తి వారిలోనే ఉంది.

ఈ సృజనాత్మకమైన కార్యదీక్ష ఒకమూలసూత్రంపై ఆధారపడి ఉంది, మానవుడు కేవలం పరిస్థితులకుగాని పారం

పర్యానికిగాని బానిసకాడని అంతశ్శక్తి సన్నిహితుడై ఉండ డానికి అవకాశం ఉందని చెప్పవచ్చు. కాబట్టి ప్రజాభిప్రాయం ప్రజల తీర్పులు అన్నవి ఆ ప్రజల నైతిక అంతర్దృష్టిని ఆధ్యా త్మిక అంతస్థును చాలవఱకు సూచిస్తుంది ఇది కేవలం స్థానిక పరిస్థితులందే కాక అంతర్జాతీయ విషయాలలో కూడా యదార్థమే.

ప్రభుత్వాలు దేశ స్వలాభాపేక్షనే పురస్కరించుకొని నైతిక విషయాలలో నమ్మకం లేనివారై విదేశాంగ విధానా లను అవలంభిస్తారని కొందరంటారు. ఇది సత్యంకాదు. ప్రభు త్వాలు వారి వారివిశ్వాసాలుబట్టి దేశీయ స్వాపేక్షకై పెనుగు లాడడం నిజమే. అదివారి విధికూడా. అసలు సమస్యలు ఏది నిజమైన దేశ శ్రేయస్సు, గమ్యస్థానం చేరడానికి ఏది నిజమైన త్రోవ అన్నది. ఈ విషయంలో ముఖ్యంగా కావలసింది రాజ కీయ జ్ఞానం కాదు. నైతిక అంతర్దృష్టి.

ఈ విధంగా ప్రజాస్వామిక విదేశాంగవిధానం దేశ ప్రజల అంతర్దృష్టిని సూచిస్తుంది.

అయితే సక్రమ నిర్ణయాలకు నైతిక విషయాలే ప్రధా నాలని నొక్కి చెప్పడంలో అన్ని రాజకీయ సమస్యలు సక్రమ పద్ధతి లేక అక్రమ పద్ధతులపై తేల్చివేయడం అని నా ఉద్దేశం కాదు. రాజకీయ విషయాలలో నైతిక దృక్పథం అంటే అన్ని సమస్యలు న్యాయధర్మాలకు సంబంధించినవే అని అనుకొన వలసిన అవసరం లేదు.

నిజానికి దాని వ్యతిరేకమే సత్యం. అందువల్ల మనం అణుకువతో సహానభావంతో మెలగాలి. అక్టోబరు 30, 1954

కొలంబియా విశ్వవిద్యాలయంలో బ్రడ్నర్ పండితుడన్న మాటలు ఈ సందర్భంలో జ్ఞప్తి ఉంచుకోవడం మంచిది. "ఇటీవల నేర నిర్ణయ పరిశీలనాసంఘాలు పెక్కు నెలకొల్ప బడ్డాయి. ఈ సంఘాలు ముఖ్యంగా రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకొని తాము మాత్రమే సక్రమ పద్ధతుల్లో నడుస్తున్నామని అనుకునేవారివల్ల ఏర్పడ్డాయి. ఈ కార్యక్రమాల్లో ప్రతిమానవుడు అన్ని వేళల సక్రమ పద్ధతిలోనే వ్యవహరించాలి అనే అభిప్రాయపై ఆధారపడివుంది. ఇట్టి అసహన భావం గ్రీకువారు సిద్ధాంతీకరించిన ఆత్మహత్యాపూరితమైన పాపంలాగున ఉంది. ఈ రోజున ఆ పాపమే ప్రకృతికి అతీతమైన శక్తిని ఆరాధించడం అనే రూపులో ఉంది.

తననుగూర్చిన దురభిమానం, తన నైతిక అంతస్థును గూర్చిన దురభిప్రాయం అన్నది వ్యక్తిలోగాని దేశంలోగాని రాజకీయ పరిజ్ఞానాన్ని చేకూర్చే త్రోవలు కావు. ఏవ్యక్తిలో అణుకువ నైతిక భావం లోపించి ఉంటుందో విషయాలకు ఆ విషయాల సత్యాలకుగల విచక్షణాజ్ఞానాన్ని తెలుసుకోలేనివాడై వుంటాడు. తన దృక్పథమే ఆశయ ముఖ్యోద్దేశమని నమ్ముతాడు.

అంతర్జాతీయ విషయాలలో నిజనైతిక దురభిమానం ఉంటే ఆలోచనాశక్తి స్థభించడమే కాకుండ ఇతరుల దృక్పథాలను అసహన భావంతో చూడడం జరుగుతుంది. మార్పు చెందు పరిస్థితులను అవగాహన చేసుకునేప్రజ్ఞ లోపిస్తుంది. రాజకీయ నైపుణ్యం అంతమొందుతుంది.

శాంతిస్థాపనకు ముఖ్యావసరమైన అభివృద్ధి పొందడాని కావలసిన ప్రజ్ఞావిశేషాన్ని పెంపొందింప జేయాలి. మః దృక్పథాన్ని మార్చకుండ మేథాశక్తిని పొందాలి. అధ్యక్షుడ ఐసన్ హూవరు నుడివినట్లు మన పాదాలు భూమిమీాదె వుండాలి. మన బుద్ధి అకాశ మండలంలో విహారించాలి అయితే ఇలాటిపని చేయడం సులభంకాదు. పాదాల భూమి మీాద మోపినప్పుడు భూమిలోకి దిగజారకుండ వుండాలి. ఆకాశాన విహరించేటప్పుడు ఏవుద్దేశమూ లేకుండ వ్యవహరించ కూడదు.

నిజమైనశాంతికి కావలసిన ప్రతిమెట్టుచూస్తూ స్వయం రక్షణకు కావలసిన శక్తిని మాత్రం తగ్గించుకోరాదు. 1954లో ప్రాక్సం దేశం అందజేస్తూ పోప్పయస్ ఈ విధంగా అన్నాడు

"సత్పురుషుల హృదయాల్లో
ఉత్పన్నం అయ్యే నిస్పృహాయే ఈనాటి కీడు"

నిస్పృహా చెందిన వారికి బలహీనులకు ప్రపంచం ఇంకా ప్రమాదస్థలంగానే వుంది.

దర్శనశక్తిలేని బలం, జ్ఞాపకశక్తి వ్యర్థం. మన సంస్కృతిలో ఏమాత్రం పరిచయం వున్నవారికైనా మన రాజకీయ సాంఘిక వ్యవహారాల్లో ముఖ్యవిషయం దర్శనశక్తియే అని బోధపడుతుంది. సంఘాలు విచ్ఛిన్నమైనపుడు దానికి కారణం హీబ్రూమత ప్రవక్త చెప్పినట్లు "దర్శనశక్తిలేని ప్రజలు నశిస్తారు" ఈ ధర్మసూత్రాన్ని నైతికమైన హెచ్చరికగా పరిగణిస్తాం కాని రాజకీయావశ్యకతగా తలపోయం.

ఇదే మన నాగరికతకు ఈరోజున నిజమైన పెద్దముప్పు. బయటనుండి కాదు. మనలోనే వుంది. "నాగరకత – విదేశాంగ పద్ధతి" అనే పుస్తకంలో హేల్ పండితుడు ఈవిధంగా అన్నాడు. "ఏ దృష్టిపై మననాగరకత ఆధారపడి వుందో అదే మనకుంటే కమ్యూనిజాన్ని గూర్చిన సమస్య చాలా వెఱ్ఱిగా కనిపిస్తుంది. మన నాగరకతకుగల కీడు మనలోనే ఉంది. మన దృష్టిలోవలనే ఉంది.

నా ఉద్దేశంలో గతించిన కాలంనాటి పాశ్చాత్యసంఘ దృష్టి హీనమైంది. దాని ఫలితాలు సుస్పష్టాలు. నిజాయితీగా ఆలోచిస్తే ప్రతివ్యక్తికి ఇది యదార్థమని నేటి చరిత్ర తేల్చి చెబుతుంది.

అయితే మన నాగరికతలో ఉన్న వంశమర్యాద సృజనాత్మకమైన కార్యాచరణ భావనాపునశ్చేతన్యాలు. ప్రస్తుత పరిస్థితుల్లో ఈ మార్పులు ఒక క్రొత్తదృష్టిని సూచిస్తాయి. ఈ అణ్వస్త్రయుగంలో అస్థిరత్వబుద్ధి మంచిదికాదు. అయితే ప్రజాస్వామ్యసంఘాలలో గడచిన కొద్ది సంవత్సరాలలో అభివృద్ధి సక్రమంగానే జరిగిందని నా అభిప్రాయం.

ఈరోజున జాగృతితోకూడిన ఆశాభావంతో ఉన్నామంటే మనల్ని ఎదుర్కొనేసమస్యల పరిమాణాలే కారణం.

బయటనుండి వస్తున్న ఉపద్రవాలవలన చరిత్రకారుని ఉద్దేశంలో కొన్ని లాభాలున్నాయి. నిర్మాణాత్మక కర్యాచరణకి దారి తీస్తాయి. సత్ప్రయత్నాలకు లక్ష్యసిద్ధికి దోహదమిస్తాయి. ఈ ఉపద్రవాలే లేని పక్షంలో మానవులు సోమరిపోతులై సంకుచితదృష్టి కలవారై ఉంటారు. ఇలాటి ఒత్తిడి

కాలక్రమంలో లాభదాయకమే కావచ్చు. ఉపద్రవం తద నంతరంకూడా ఈ సహకార భావంతో వ్యవహరించే వర్ధతులే అలవాటై మానవజీవితాన్ని అభివృద్ధిపరుస్తాయి.

ఇట్టి సృజనాత్మకమైన కార్యాచరణకి దృష్టాంతం 1760 లో బ్రిటన్‌నుండి కలిగిన ఉపద్రవాన్ని ఎదుర్కొనడానికి ఏర్పడిన అమెరికా దేశపు పదమూడు రాష్ట్రాలకూటమి, ఒక శతాబ్దానంతరం ఏర్పడిన కెనడా దేశపు రాష్ట్రాలకూటమి ఇంకొక నిదర్శనం. దీనికి ముఖ్యకారణం దక్షిణసరిహద్దులోగల బలవత్తరమైన రాజ్యాల భయమే.

ఆధునిక దృష్టాంతాలుకూడా చూడవచ్చు. 1940 లో అమెరికా ఆర్థికసహాయంవలన పాశ్చాత్యయూరపు దేశ ప్రజా స్వామ్యాల పునరుద్ధరణ సోవియట్ సామ్రాజ్యవాదభయం వల్లనే జరిగింది

ఆ దేవిధంగా ఉత్తర అట్లాంటిక్ సహకార వృద్ధికి ముఖ్యకారణం అదే. ఇట్టి ఆర్థిక సాంకేతికరంగాలలో నాగరికతలకు మధ్య గల సహకారం బయటనుండి వచ్చే ఉపద్రవం వల్ల సులభమైంది. ఈ ప్రస్తుతసమస్యలను ఎదుర్కొనగలిగిన ఈ సహకారభావమే బయట ముప్పు గడచిన తర్వాత సత్ఫలితాలు ఇవ్వగలదని ఆశించవచ్చు.

అన్నింటికన్న అంతర్గత చైతన్యం ముఖ్యం. ప్రతి నాగరికతలోగల ప్రత్యేకత ఆ ప్రజల ఆలోచనపైన, వారి భావావేశాలపైన ఆధారపడి ఉండదు. అంతకంటె మిక్కుటముగా వారు ఏలాటి కార్యాలు చేయడం సమంజసం అని తలపోయడంలో ఇమిడిఉంది.

జీవితం అన్నది మానవులకు రెండు సమస్యలు సూచి స్తుంది. ఏది చేయడం? ఎలాగ చెయ్యడం? ఇదే వంశపారం పర్యంగా వచ్చే ఆశయం. ఆశయసిద్ధిని సమకూర్చే సాధనాలు ఏవి అనేదే సమస్య.

'ఎలాగ?' అన్నది సాంకేతిక ప్రశ్న. సాంకేతిక రంగా లలో సాంఘిక శాస్త్రాలలో తప్ప గడచిన ఏభై సంవత్సరా లలో పాశ్చాత్య దేశం దీనికి విజయవంతమైన సమాధానాలే ఇచ్చింది. సాంఘిక శాస్త్రాల్లో కూడా రాజకీయ ఆర్థిక సమస్య లకు యీ సాంకేతిక విజ్ఞానంలోగల శక్తిని, ఊహాజ్ఞానాన్ని సమకూరిస్తే సమస్యలు పరిష్కారం అవతాయని కొంద రంటారు.

ఇంతకన్న ఎక్కువే కావాలి. లక్ష్యసిద్ధికి ముఖ్యమైన ప్రశ్న దేనిని చేయడం అన్నది.

అందువల్ల విలువలను గూర్చిన విషయాలు ముఖ్యాలు. ఇలాటి సందర్భాలలో మానవుని మేధాశక్తివంటి ఇచ్ఛాశక్తి ఎక్కువముఖ్యం. సాధనాలకన్న లక్ష్యసిద్ధి ప్రాము ఖ్యం. నేను చాలమార్లు చెప్పినట్లు దీనికి వాస్తవిక బుద్ధితో కూడిన జ్ఞానదృష్టి కావాలి. ఈ రెండు నిరంతరం కలిసి ఉండాలి.

నిజమైన వాస్తవికవాది విషయాల్లో సత్యాన్ని, అసలు విషయాల్లో ఉండగల సత్యాన్ని చూడగలడు. ప్రతి పరిస్థితిలో అభివృద్ధికి అవకాశంఉంది. ప్రతిజీవిలో శ్రేయోదాయకమార్గా నికి శక్తి అంతర్గతమైఉంది. నిజమైన వాస్తవికత కాదు. అంధ

త్వమే. యీ రెండింటిమధ్య దృష్టి చాలా ముఖ్యమైంది. కాని రెండూ అత్యవసరాలే.

మానవుని సర్వోన్నత ప్రథమసూత్రం విలువలకు విశ్వజనీనకత, నిర్గుణం కలిగిన సత్యం ఉంది. యీ విలువ సత్యాన్ని కొద్దిగా మాత్రమే అర్థం చేసుకొనే బుద్ధి, జ్ఞానం వ్యక్తులకున్నాయి. దీనివలన సహజభావం ఇంగితజ్ఞానావశ్యకత మానవులకు తెలిసింది.

క్షీణపరిస్థితుల్లో ఈ ఉత్తమగుణాలు నిర్లక్ష్యంగాను ఒక దృక్పథమే లేక అభిరుచియేమంచిదను సోమరిపోతుభావంగా మారుతుంది. అందువల్ల ఏ పరిస్థితినీ అవగాహనచేసుకోము. దాని ఫలితం నైచ్యగుణాలను వ్యాఖ్యాన రహితంగా ఆమోదించడం జరుగుతుంది. దీనివలన విద్వేషం, అసహనం మూలంగా ఎంత ప్రమాదం రావాలో అంతప్రమాదం ఉద్భవిస్తుంది. శ్రేయస్కరాభివృద్ధి సమూల నాశనమౌతుంది.

అయితే ఈ ఉపన్యాసాలను నిరాశాపూరిత భావంతో పూర్తిచేయ దలుచుకోలేదు. మొదలుపెట్టిన దానికే తిరిగి వస్తాను. అదే చరిత్ర. ఈ చరిత్ర మన ఆందోళనలకు ప్రస్తుత అసంతృప్తికరమైన సమస్యలకు సమత్వభావం ఇస్తుంది. ఈరోజున జ్ఞానవికాసానికి, స్థైర్యానికి అత్యవసరం వున్నా అపజయానికి నిష్ప్రయోజనం మాత్రం కారణంలేదు.

తదితర వ్యక్తులతో శాంతియుత సంబంధాన్ని ఏర్పరచుకోలేక దానినుండి కలిగిన అపజయాలవల్లనే విచారస్ఫురణలో నిమగ్నుడైన మానవుడు ఎన్నోసార్లు వినాశకాలం ఆసన్నమౌతోందని నమ్మేడు. అయితే అలాంటి క్లిష్టపరిస్థితుల నుండి

ఏదో విధంగా తప్పించుకోగలుగాడు. భవిష్యత్తును గూర్చిన నిరాశాపూరిత ఊహాగానం అపాయంతో కూడిన మానసిక పరిశోధన. 18 వ శతాబ్దంలో బ్రిటిష్ సామ్రాజ్యం సర్వ నాశనమైందని తలపోశారు. విలియమ్ విల్బర్‌ఫోర్స్ 1790లో "నేను పెళ్ళిచేసుకోను. భవిష్యత్తు చాలా అంధకారంగా అస్థిరంగా వుంది" అన్నాడు. పాతిక సంవత్సరాల తర్వాత వాటర్లూ వద్ద నెపోలియన్‌ను అపజయం తటస్థించిన సందర్భంలో యూరప్ దేశం అంతా రష్యన్ రాజుల హస్తగతం అయిందని అనిపించింది. కాని కొద్ది సంవత్సరాలలో యూరప్ తన స్వాతంత్ర్యాన్ని పొందగలిగింది. ముప్పైసంవత్సరాల తర్వాత శాంతి తృప్తికి ఆటపట్టయిన విక్టోరియా యుగంలో వెల్లింగ్‌టన్ డ్యూక్ ఈవిధంగా నిట్టూర్చాడు. "ముంచుకొస్తున్న ఈవినాశాన్ని చూడకుండాచేస్తున్నందుకు భగవంతునికి నాకృతజ్ఞత"

అసలువిషయం మరణం సర్వనాశనం అనే ముప్పులు ఆవరించేటప్పుడు స్వేచ్ఛాప్రజలనుండి "ఇది జరగదు" అని ప్రతిధ్వని వస్తుంది. ఈ ప్రతిధ్వనులవల్ల మానవుడు తన్ను తాను రక్షించుకోవడమే కాకుండా భవిష్యత్తునుకూడా కాపాడుతాడు.

ఈ అణ్వస్త్రయుగంలో ఇదే క్లిష్టపరిస్థితుల్లో అదే విధంగా తిరిగి జరగవచ్చు.